శ్రీ రామచంద్రాయనమః. శ్రీ రమణమహర్షయేనమః.

# మహర్షియును తత్సందేశమును.

(పాల్ బ్రంటన్ గారి యింగ్లీషునకు తెలుఁగు)

# శ్రీమదరుణాచలాష్టకము

(శ్రీ రమణమహర్షులవారి యరవమునకు తెలుఁగు.)



అనువాదకుఁడు

దోమా - వేంకటస్వామిగుప్త.

ప్రకాశకర్త:

శ్రీ నిరంజనానందస్వామి.

సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై.

1936

THE ANDHRA BOOK HOUSE,

SULTAN BAZAR, HYDERABAD DN.

## పీఠిక

ఉ. శ్రీరమణర్షి మౌళిమణి
చెన్నును నాతఁడు చెప్పినట్టి సు
శ్రీరమణీయబోధమును
శిష్టుఁడు తన్నుతుఁడైన "బ్రంటు"న౯
ధీరుఁడు హూణభూభవుఁడు
తెల్పిన చొప్పు తెలుంగు సల్పె: వి
స్తారమహర్షిసత్కరుణ
చంద మెలర్పఁగ దోమ. వేంకటా
ఖ్యారుచిరుండు తన్మునిప
దాంబుజబంభరుఁ; డట్టి పొత్తమీ
తీఱున నచ్చు వేసి సారి
దె౯ మునిమౌళియెడ౯ నిజాశయో
దారసుభక్తి యిట్టి లఘు
దారెడు నంచును జూపినాఁడు సొం
పారఁ ద్రిలింగదైవతక
ళావన పావన వావిళాన్వయాం
భోరుహవాటికారవి సు
పుణ్యగుణాఢ్యుఁడు వేంకటేశుఁ; డీ
తీఱున వారివారి కిది
తీర్చిన పాలు చెలంగు నెల్ల వా

శారమణర్షి భవ్యకృప
నందుదు రందము నెల్ల భంగులన్

ఉ. అంతియ కాక దీని గను
నట్టి సమస్తజనంబుగూడ న
త్యంతముఁ దన్మునీంద్రుకృప
కగ్గము గావుత మంచు నా మనం
బెంతయు గ్రంథ మియ్యది మ
హీతలమందు ముముక్షుపాతక
ధ్వాంతదినేంద్రబింబమయి
పర్వ నొగిన్ భగవద్దయన్ దగన్.

ఇట్లు,
శ్రీరమణమహర్షి దివ్యపాదారవింద ప్రణతుఁడు,
శిష్యపరమాణువు,
దోమా. వేంకటస్వామిగుప్త.

మదరాసు
నవంబరు 1936.

# మహర్షియును తత్సందేశమును.

పాల్ బ్రంటన్ గారి

"THE MAHARSHEE & HIS MESSAGE" కు తెలుగు

"A Search in Secret India" (భారతదేశరహస్యాన్వేషణము) అను పొత్తమునుండి పునర్ముద్రణార్థము కైకొనఁబడిన మూఁడధ్యాయములకు పీఠిక)

లండన్ నగరమునందలి రైడర్ అండు కంపెనీవారు 1934 వ సం॥ లో "A Search in Secret India' భారతదేశ రహస్యాన్వేషణము) అను గ్రంథమును బ్రచురించిరి. కొద్ది కాలములోనే దానినగు పలుకూర్పు లమ్ముడుపోయినవి. హిందూదేశమునుగూర్చిన పొత్తములలో నది మిన్నయను పే రేర్పడినది. దానియొక్క జయశాలిత్వము నూహించి "లండన్ ఫోరం" సంపాదకులు బ్రంటన్‌దొరగారిని వారు హిందూదేశయాత్ర గావించినందులకుఁ గల కారణాభిప్రాయములను సంక్షేపముగాఁ జెల్పవలయు నని కోరిరి. అందు లకుఁగాను బ్రంటన్‌దొరగారు వ్రాసిన మనోహరమయిన స్వీయచరిత్రకవ్యాసము "ఫోరం" ఆగస్టు సంచికలో బ్రచు రింపఁజేసిరి. వారు "The Secret Path" (రహస్యమార్గము)

అను నొక యుజ్జీవకరమయిన గ్రంథమునుగూడ రచియించి యున్నారు. అందు వారి యుపసంహారవాక్య మిది:—"ఈరీతిగా మన మవినశ్వరజీవితమునఁ బ్రవేశించి సత్య-జ్ఞాన-శాంతి-శక్తులయొక్క శాశ్వతఫలముల నందుదుము." ఈ రెండు పుస్తకములకును పాశ్చాత్యదేశములలోఁ బ్రచార మెక్కువగా నున్నది. తత్ఫలితముగా నవనాగరకత్వవాతావరణమధ్యమునఁ బుట్టి పెరిగిన యొక పక్కా పాశ్చాత్యవ్యక్తిని సమ్ముగ్ధుని గావించి యతఁడు ప్రాచ్యజ్ఞానము నత్యుత్సాహముతోఁ బడమటివారికి వివరించు బోధకుఁడగునట్లు చేసిన మహర్షులవారి సందర్శనార్థమై యా దేశములనుండి పలువురు యాత్రికు లేతెంచుచున్నారు. "A search in Secret India" (భారతదేశరహస్యాన్వేషణము) నందు తద్గ్రంథకర్తగారికి అంతగా తమ్ము వశపఱచుకొన్న శ్రీమహర్షులవారితో ఏర్పడిన పరిచయమును వారినిగూర్చి కల్గిన యభిప్రాయములును వారితోఁ గల్గిన యనుబంధమును వారు ప్రకటింపించిన పుస్తకముయొక్క ప్రకృతపు వెల 15 షిల్లింగులు. అనఁగా భారతదేశములోని సామాన్యజను లద్దానిని గొని చదువఁజాలరన్నమాట. కనుక అందునుండి శ్రీరమణమహర్షులవారికి సంబంధించిన 9, 16, 17వ యధ్యాయముల నుద్ధరించి ఆగ్రంథకర్తగారి సమ్మతితో నొక చిన్నపొత్తముగాఁ బ్రకటింపఁబడుచున్నది. ఈరీతిగా వారిచే రచియింపఁబడిన గ్రంథములోని ముఖ్యభాగము భారతజనులలో సామాన్యుల యందుఁ

భాషలోనికిఁ దేఁబడుచున్నది. అయినను ఈయధ్యాయములు మూలగ్రంథమయిన "A Search in Secret India" (భారతదేశ రహస్యాన్వేషణము) లో సందర్భానుసారముగా జదువుకొన్నచో నింకను మెఱుగుగా నుండ నోపు. ఆవిలువను భరింపఁగల వారట్లు చేయనచ్చును.

గ్రంథకర్తగారి బాల్యమునఁ బాఠశాలయందు భూగోళశాస్త్రపఠనసమయమునందు హిందూదేశము చక్రవర్తిగారి కిరీటమునందు మిక్కిలి ప్రకాశమానమయిన రత్నముగా వర్ణింపఁబడుట వినిరి. దానంజేసి వీరికి హిందూదేశమునందు నొకవిధమయిన పేర్మి ప్రారంభమయినది. అంతియకాక భారతదేశ విశేషములనుగూర్చిన యొకానొక భావనాసరణి మిక్కిలి శక్తితో నతని హృద్వీథియందు మెలఁగసాఁగెను. అప్పటి నుండి హిందూదేశసందర్శనార్థ మతఁడు వూనుచుండెను. అతఁడు యువకుఁడయినతరువాత ఆధ్యాత్మికపరిశ్రమయందుఁ బ్రవేశించి దివ్యజ్ఞానసమాజసభ్యుఁ డయ్యెను. అం దతనికిఁ గల్గిన యనుభవమువలనఁ శరీరవినాశానంతరము జీవుఁడు వర్తించు ననునమ్మకము కుదిరినది. తదనంతర మతఁడు పత్రికా విలేఖకత్వమునఁ బ్రవేశించెను. కొన్నాళ్లయినతరువాత నతని కొక హైందవుఁడగు నాధ్యాత్మికత్వాభిమానితో స్నేహ మేర్పడి, తనయొక్క చిరాగతాభిమానవిషయమునుగూర్చి పేర్మి పెంపొందినది. దానిపై నతఁడు 1930 వ సం॥లో భారతదేశమునకు బయలుదేఱి యందలి యనేకస్థలములను అనేక

జనులను సందర్శించి కట్టకడపటఁ జెన్నపురిఁ జేరిరి. అక్కడ వారి కకస్మాత్తుగా అడయారు సన్యాసిగారితోఁ బరిచయ మేర్పడినది. వారీగ్రంథకర్తగారి నొక మౌనస్వామికడకుఁ గొంపోయిరి. అతని యాశ్రమమునందు సుబ్రహ్మణ్యులను వారితో ఈ గ్రంథకర్తగారికి పరిచయ మేర్పడినది. వారు ఈదొరగారిని తమ గురువర్యులయిన తిరువణ్ణామల రమణ మహర్షులవారి సన్నిధికిబిల్చుకొని వెళ్లెదమని చెప్పిరి. * కాని గ్రంథకర్తగారావిషయమునుగూర్చి యాలోచనలో నుండిరి. వారిదగ్గఱ నెందఱో హిందూమహాజనులకడకు పరిచయలేఖ లుండినవి. అందొకదానినిబట్టి చెన్నపురము నందలి సుప్రసిద్ధగ్రంథకర్తలలో నొకరగు శ్రీ కె. యస్. వేంకటరమణిగారీ గ్రంథకర్తగారితో సమావేశమై, అప్పుడు చెంగల్పట్టులో నుండిన తమ పీఠాధిపతులగు శ్రీశ్రీ కామకోటి పీఠ శంకరాచార్యులవారి సన్నిధికి వీరిని గొనిపోయిరి.

---

* సుబ్రహ్మణ్యులవారు నన్ను శ్రీరమణమహర్షి సన్నిధికిఁ జేర్ప నియ్యకొనినవిధము చిత్రమయినది. పాఠకుల వినోదార్థ మది యియ్యెడ బొందుపఱుపఁబడుచున్నది.

నేను మదరాసులోనికిఁ గొనిపోవు రోడ్డును జేరునప్పటి కొకరు నాతో తారసిల్లిరి. చూడఁగా నతఁడు కాషాయాంబరధారియగు నొక యోగీశ్వరుఁడు. అతఁడు నన్నుఁ జిఱునవ్వుతోఁ బొడగాంచి నన్ను పలుకరించి నే నీయెడకువచ్చిన కారణ మడిగెను. అందులకు నేను "ప్రయాణ" మను జబాబు చెప్పఁగా సంభాషణమధ్యమున నాకు యతీశ్వరుల విషయమున మక్కువ యున్నట్లు తేలినది. తాను యోగీశ్వరుఁ డనియును మూఁ

అక్కడ జరిగిన సంవాదమునందు శ్రీ జగద్గురువులవారు

డేండ్ల క్రిత మాశ్రమస్వీకారము గావించినట్లును అంతకుముందు 7 సంవత్సరములు బ్రిటిషు పటాలములోఁ బని చేసియున్నట్లును తన పేరు సుబ్రహ్మణ్య మనియుఁ దెల్పెను. పిదప జరిగిన సంభాషణములో తనకు గురువై చెప్పఁబడిన మహనీయుఁడు హిందూదేశమునఁ గల యోగీశ్వరులలో శ్రేష్ఠుఁ డనియుఁ దేలినది. అంతియకాక యతని యాకర్షణచేతనే నే నిక్కడికివచ్చినట్లు అతఁడు చెప్పెను. నా కా మాటనమ్మకము గల్గింపకపోయినను అతఁడు ఆమహర్షి నా ప్రశ్న (ఉక్తానుక్తము)లన్నిటికిఁ బ్రత్యుత్తరములు చెప్పఁ గలఁ డనియు అతని సెలవగు అరుణాచలమునకుఁ బోఁదగుననియుఁ దెల్పెను. అక్కడికి వారు రమ్మనుట నేను రా ననుట జరిగినది. నేను వాయవ్యదిశకు వెళ్ల నేర్పాట్లు జరగియున్నట్లు తెల్పితిని. అతఁడు నన్ను వీఁడిపోయెను.

కాని యతనికి నాకును జరగిన సంభాషణమునుగూర్చి పర్యాలోచించితిని. ఈ హిందూదేశమునందలి సంచారమువల్లఁగల్గిన యనుభవమువల్ల కొందఱు తమతమ గురువులనుగూర్చి మిక్కిలి యుద్రేకముగాఁ బొగడుచుందురను నభిప్రాయము నాయం దేర్పడియుండెను. ఎందుకనఁగా వీరు చెప్పిన విషయములలో నదీప్రవాహ మున్నట్లు చని పరిశీలింపఁబోఁగా అక్కడ తేమగూడ ఉండదు. ఇట్లెన్ని సందర్భములయందో శిష్యుల మాటలను విని వారిగురువులను సందర్శించి మిక్కిలి యాశాభంగము నొందియుంటిని. ఈద్రవమునం దారోగ్యముగూడ తగ్గియుండినది. అర్ధరాత్రమునకు నేను నాయునికిఁ జేరఁగా అక్కడఁ జీఁకటిలో సుబ్రహ్మణ్యులు నాకుఁ గన్పట్టిరి. మాకు జరగిన సంభాషణమున మఱునటి యుదయమున శ్రీరమణమహర్షి సన్నిధికై నేను వారితోఁ గలసి తిరువణ్ణామలకు బయలు దేఱవలసినట్లు తేలినది.

(శ్రీకామకోటిపీఠాధిపతులు) ఈబ్రంటన్‌దొరగారు శ్రీరమణ మహర్షులవారిని సందర్శించినచో ననుమానవిచ్ఛిత్తి గావచ్చు నని యాశాసించిరి. వా రింటికి వచ్చుసరికి దొరగారిని తిరు వణ్ణామలకుఁ గొంపోవుకొఱకై సుబ్రహ్మణ్యులు సిద్ధముగా నుండిరి. శ్రీమహర్షులవారితో దమకుఁ గల్గిన సమావేశమును గూర్చి గ్రంథకర్తగారు సంతృప్తిగా నిట్లు వక్కాణించి యున్నారు:—

"శ్రీరమణమహర్షిగారితో నా కేర్పడిన సమావేశ మునుగూర్చి తెల్పవలసినచో "వెదుక వెదుక దొఱకు వేదాంత వేద్యుండు, వెదకు వారిఁ దాను వెదకుచుండు" అను వేమన పద్యార్థ ముదాహృతంబయినది. ఏ మనఁగా, వారికడకు నేను వెడలఁ బ్రయత్నింపకున్నను నాయదృష్టమే నన్ను బలవంత పెట్టి యటకు నన్నుఁ గొనిపోయినది.

వారు తిరువణ్ణామలలో నుండిన విషయమునుగూర్చి వారిగ్రంథములోని మొదటి యధ్యాయములో "The Hill of the Holy Beacon" 'శ్రీమదరుణాచలము' అను శీర్షికతో వ్రాసియున్నారు. శ్రీమహర్షిగారి తొలుతటి సందర్శన మయిన తరువాత వారు భారతదేశమునందలి యుత్తరభాగమునకు వెడలి యందు పెక్కులగు మనోహరములును వినోదవంత ములును నయిన సందర్శనసమావేశములను గావించినట్లును, తన్మధ్యంబున చండిదాసుఁడను నొక్క త్రికాలజ్ఞుఁ డితనితో శ్రీ రమణమహర్షిగారిని మరల నొకసారి సందర్శింపవలయునని

తెల్పినట్లును, వీరు బొంబాయికి వచ్చినంతలో జబ్బుకనిపించిన తమదేశమునకు పయనము గట్టఁగా శ్రీరమణాశ్రమమునుండి శ్రీరమణమహర్షులవారి జీవితమ్మును "self realisation" అను పేరితో రచియించిన శ్రీ బి. వి. నరసింహస్వామిగారినుండి వచ్చిన యాహ్వానలేఖనుబట్టి స్వదేశప్రయాణముమానుకొని యాచార్యదర్శనార్థ మాశ్రమమునకు రావలసిన వా రయిరి.

"ప్రాచ్యదేశమునందు నేనెందఱినో యోగీశ్వరులను సందర్శించి వారి యోగాదివిశేషములను గమనించి యున్నాను. వారు తమలో నుండు ఆత్మశక్తి తేజోవిశేషములకన్న తాము తమకడఁ జేసికొన్న నిత్యనైమిత్తికాదులగు నేర్పాటులవల్లఁ దాము దేవుని ప్రతినిధు లను భావమును గల్గింపఁదలంచినట్లు తోఁచెడిని. కాని యీ రీతు లన్నియు హేతువాదమునకు నాఁగఁజాల వని నాయాశయము. ఈ యాశయమే నన్ను వీఁడకయే యుండినది. కట్టకడపట నత్యంతమహానుభావుని గాంచితిని. ఆమహనీయుఁడు 20 సంవత్సరములపాటు కొండ గుహలలో నుండి పరతత్త్వపరిశోధన మొనరించినాఁడు. అతడు గొప్ప చదువు చదివినవాఁడు గాక పోయినను నేను మిక్కిలి సంతోషముతో ఈపుస్తకములోని 16, 17 వ అధ్యాయములలో నతఁడు జ్ఞాననిధాన మని వాకొనినాఁడను"

## "A SEARCH IN SECRET INDIA"

## భారతదేశరహస్యాన్వేషణము.

ఆరణ్యకుఁడయిన యీమహర్షి నిగూర్చిన ప్రశంసను గ్రంథకర్తగారు తమ "The Secret Path" (నిగూఢమార్గము) అను గ్రంథమునం దింకను ఈయుదాహరించినరీతిని వ్రాయుచున్నారు:—

"ఆధ్యాత్మికవిజ్ఞానమునకు స్థానమనఁబడు ప్రాచ్యభూభాగములందు నేను చాలకాలము సంచరించినాను. కాని ఆవస్తువు సరిగా కానరాలే దనవచ్చును. అట్లు సంచరించుచుండఁగా నొక మహనీయుని దర్శనము నాకు లభించినది. అతఁడు నాయొక్క భక్తిగౌరవములకు సంపూర్ణముగా బాత్రుఁ డయ్యెను. భరతఖండమందనులై యుండిన మహామునీశ్వరుల రకము వాఁ డతఁడు. కాని యతనికి స్వకీయమయిన ప్రకటన మేమాత్రమును నిష్టము కాదు.

అనంతమయిన కాలమహాప్రవాహ మీమానవాదిసమస్తచరాచరకోటిని దనతోఁ గొంపోవుచు తన త్రిప్పులకు లోను గావించుకొని సుఖదుఃఖవృద్ధివినాశాదిపరిణామము లొందించుచుండును. ఒక మహానుభావుడుమాత్ర మీప్రవాహములోఁబడక యొడ్డునఁ గూర్చుండి దాని చర్యల కానందించుచున్నాఁడు. ఇట్టి వాఁడే మహర్షి. ఇట్టి యప్రమేయప్రభావసంపన్నుల నీలోకము తన తాలూకు మిక్కిలి చిన్నదయిన చూపులతోను కొలఁతలతోను శక్త్యశక్తులను నిర్ణ

యింపఁ బూనును గదా? కాని వారి ప్రభావాదుల నన్నింటి నెఱుంగుట కింకను సాధనము లేర్పడలేదు. ఆసియా ఆఫ్రికా ఖండములం దింకను అక్కడ నక్కడ నీవితంబయిన ఆధ్యాత్మికమహానుభావులు గనుపట్టుచుందురు. పయినికిఁ జూడఁగా వీరిలో ఈచర్మచక్షుర్గోచరవిశేష ముండదు. కాని వారే పారమార్థికజ్ఞాననిధానసంరక్షకులు సంవర్ధకులు.

మొదట నేను శ్రీమహర్షులవారితో నకస్మాత్తుగా సమావేశమయితిని. అప్పుడు వారు నే నెవ్వరయినది తెలిసికొనుటకు ప్రయత్నింపలేదు. కాని యొక నిశితమయిన యపాంగమును నామీఁదకుఁ బఱపిరి. దానితో వారు నా మంచిచెడ్డ లన్నింటిని గ్రహించినట్లు నాకుఁ దోచినది. అంతియేకాక జ్యోతిర్మయమయిన వారి చూపులనుండి నాబహిరంతర్భాగములపయిన నిర్మలపుష్పవర్షము గుఱిసిన ట్లయినది. అప్పుడు నే నతనిని వెన్నాడి యాధ్యాత్మికరహస్యములను గనుగొనఁగల ననియును నాయొక్క మనోదుఃఖము లాతని సాంగత్యమునంజేసి సమయఁగల వనియును అతనియొక్క యనుగ్రహమునంజేసి నేను జీవితమునందు విసుఁగుఁదల నొందక ప్రశాంతముగా కాలము గడుపఁగలననియును నాకుఁ దోఁచినది. సాధారణముగా ఆమహర్షులవారి ప్రవర్తనము మౌనము. ఎప్పుడో యొకప్పుడు వారు మాటాడుదురు. ఆవిషయము దైవికాధ్యాత్మికాదులలోఁ జేరియుండును. ఆచూపులయందు బ్రహ్మతేజమును ఆనుదులను మార్దవ

సహితబ్రహ్మవిద్యయు వెల్లివిరియుచుండును. ఇంతవఱకు మత కర్తలందఱును పాపభయమునుగూర్చి హెచ్చరించిన వారే కాని మనుజునిలోని మంచితనమును దెల్పి యాసఁ జూపినా రీమహానుభావులు. అది యేమివింతయో యమ్మహానుభావుని దివ్యసాన్నిధ్యమును జేరినంతటనే యెవని హృదయమునం దేనియును ప్రశాంతి వెన్నెల ప్రసరించును. ఆతేటఁదనము నైరాడంబర్యము నా కాయనయం దెంతయును భక్తివిశ్వాసములను గల్గించినవి. వారు నోటఁ దెల్పున వెన్నియో యమూల్యములును మధురాతిమధురములును మర్మాతిమర్మములును జ్ఞానవిలసితములును నయిన సంగతు లుండును కాని వారహాంగంబులద్వారా ప్రసరింపజేయు నవనవోన్మిషత్సుజ్ఞానప్రబోధములు మానసానుభవైకవేద్యములే యగును గాని మఱొకళ్లకే రీతిగాను దెల్ప నసాధ్యములు.

ఇంకొక వింత! వారొక చిఱునవ్వు నవ్వినఁ జాలును. అది యెంతో భావగర్భితముగాను రహస్యభేదకముగాను సాధనబోధకముగాను బ్రశాంతిదాయకముగాను సుజ్ఞానశోభితముగాను ఉండినది. అతఁ డానందమయుం డయ్యును నతని మోముధామర యగాథాలోచనసంభరితం బయిన ట్లుండినది. ఎమర్సన్‌గారు తమ "ట్రాంసు అట్లాంటిక్ డయిరీలో "పెద్దలతో సమావేశమయినప్పుడు జ్ఞానఫలమును సంపాదించుకొందు" మని వ్రాసియున్నాడు. ఈమహర్షులవారి సమావేశమున నట్టిజ్ఞానఫలములను గంపలకొలఁది సంపాదించినాను.

## శ్రీమదరుణాచలము.

సుబ్రహ్మణ్యులును నేనును చెన్నపురమునుండి బోటు రయిలులో బయలుదేఱినారము. కొన్ని గంటలవఱకు అనేక ప్రకృతివిలాసమయములయిన స్థలములలోనుండి మా ప్రయాణము జరగినది. వరిమళ్లు టెంకాయచెట్లు అనంటులు చిట్టడవులు పర్వతములు కాంతారములు వంకలు నదులు మత్రోవయందు వినోదము గొల్పినవి. బ్రామాగారు నా కొకయుంగరము నొసంగినప్పటినుండి నాకు వింతలు సంఘటిల్లుచున్నవి. ప్రయాణము చేయునప్పుడు "సుబ్రహ్మణ్యయోగి చెప్పిన ప్రకారముగా ఈగమ్యస్థానమునందు కేవల మార్థికవ్యామగ్ధుఁడయిన నావంటి పాశ్చాత్యునికిఁగూడ నచ్చునంతటి స్ఫుటతరమయిన యాధ్యాత్మికవైభవ ముండునా యనిపించినది. సుబ్రహ్మణ్యయోగీశ్వరులు నికరముగాఁ జెప్పిన ప్రకారముగా ఇప్పుడు నేను నాయితరమయిన ప్రయాణమును గట్టిపెట్టి యరుణాచలమునకుఁ బ్రయాణము చేయుటకుఁ గారణము మామునీంద్రునియొక్క గొప్ప శక్తియే కారణమా యను ననుమానముగూడ నామానసమునందుఁ గల్గుచున్నది. నిజమాలోచింపఁగా సుబ్రహ్మణ్యులును నతని గురువుగారును నన్నీమహర్షివర్యులకడ కొక ప్రతినిధిత్వము బూని పిలుచుకొని వచ్చిన ట్లయినది. చూచుటకు మిక్కిలి సామాన్యములుగా నుండు విషయములనుండియే యద్భుతఫలితము లేర్పడ

వచ్చు నని నా యనుభవపూర్వకమయిన యాశయము. హిందూదేశమునందుఁ బుదుచ్చేరీ యను పురము గలదు. అది ఫ్రెంచివారికిఁ జెందినది. రాజ్యముగా ఫ్రెంచివారికి హిందూదేశములో మిగిలిన స్థలములలో ఈపుదుచ్చేరి యొక్కటి. ఆయూరికి 40 మయిళ్లదూరమునందు మేము రయిలును మార్చుకొంటిమి. అనఁగా ముఖ్యమార్గమునుండి శాఖలోఁ బ్రవేశించినాము. అది విళుపురమునుండి కాట్పాడికిఁ గలుపును. అందు రెండుగంటల ప్రయాణమయినతరువాత నను కుగాఁ దెల్లవాఱుచున్నది. అప్పుడు కొంచెము పొగమంచు గాఁగూడ నున్నది. అప్పుడు నావెంట నున్న సుబ్రహ్మణ్యులు నన్ను కదుపఁగా నే నెట్లో నిదురనుండి మేల్కొని యాస్టేషనులో నతనితో దిగినాను. అక్కడ నతనితో తెల్లవాఱువఱకుంటిని. తెల్లవాఱుసరికి నాకుఁ గిటికీనుండి యొక్క-యొంటరి యగు కొండ కనుపట్టినది. దాని మూలమునుండి మధ్యము ఫలకు విస్పష్టముగాఁ గనుపట్టుచున్నది. కాని శిఖరము పొగమంచుచేఁ గ్రమ్మఁబడియున్నవి.

సుబ్రహ్మణ్యులవా రాగదినుండి వెలికిఁ బోయి యక్కడ నొక రెండెడ్ల బండిని అందులో గుర్రు పెట్టి నిదురించుచున్న బండివానిని గాంచి వానిని తట్టి లేపిరి. వాఁడు బండి తయారుచేయఁగా నేనును అతఁడును దానిగూటిలో దూటి కూరుచుంటిమి. నిజముగా రాకపోకల కిట్టిసాధనము లిక్కడనుంట పాశ్చాత్యుఁడ నగు నా కొకవిధముగా నే తోఁచినది.

బండి కదలినది. వేగ మెన్ని గంటల కొక మయి లనఁదగిన దేమో? ఆబండి గ్రామమువైపున బోసాఁగినది. అక్కడి నాగరకత మొదలయినవి నాకుఁ గనుపడినంతవఱకు శతాబ్ద ములనుండియు నెట్టిమార్పును జెందినట్లు కనుపట్టలేదు.

ఇంతలో నెండ యెక్కినది. అప్పుడు మా సారథి తన యెఱుపెక్కిన శరీరముతోను తన యెద్దులను గూర్చిన యొక విధమయిన గరువముతోను మాకుఁ గనుపట్టినాఁడు. మేము ప్రయాణము సాగింపఁగాఁ బ్రొద్దు ప్రొద్దున లేచి పనికి వెడలు చున్న యొక కష్టజీవి యగు హాలికుఁడు గన్పట్టెను. అంతట దలపై నొక యిత్తడి కడవను దాల్చిన యొక యువతి. ఆమె దాల్చినది చీర యొక్కటియే. భుజములు వివస్త్రములు. ఆమె మేని నలుపామె పక్కా ద్రావిడి యని తెల్పెడిని. ద్రావిడు లలో తురకలు బ్రాహ్మణులు తప్ప ఈ ప్రాయపుఁ జిన్నారి యువతు లుల్లాసముగా నుందురు. ఆమె మమ్ము నాశ్చర్య ముగా చూచినది. ఆవల ఊరిలోనికి బ్రవేశము. గ్రామము మనోహరముగాను వీథులు చక్కగాను ఉన్నవి. అందొకగొప్ప దేవాలయము గలదు. దాని నిడివి సుమా రొక పావుమయి లుండును. దాని ద్వారదేశముఁ జేరినప్పుడు ఒకటి రెండు నిమిషము లక్కడ నిల్చి దాని శిల్పచాతురి కాశ్చర్యా నందము లొందక తప్పినది కాదు. ఆదేవాలయము శిలా మయము. ఆకట్టడము శతాబ్దులనుండి యెండలఁ గ్రాఁగుచున్న యది. నే నాద్వారములోనుండి లోనికి వెడలి చూడఁగా

మిక్కిలి విశాలమయిన చదుకము. నాలుగు గోడలు. వానికి నాలుగు తలుపులు. ఆద్వారమ్ములపయిన మహోన్నతము లయిన గాలిగోపురములు. వీనిన్నీ జూడఁగా నా కీజిప్టులోని పిరమిడులు జ్ఞాపకమునకు వచ్చినవి. ఈగోపురములకెన్ని యో యంతస్తులు. వీని వెలిభాగము లన్నియు ననేకములగు వింత వింత బొమ్మలతోఁ జిత్రింపబడియున్నవి. ఈగోపురములుగాక ఈగోడల యావరణమునందు నయిదింటికి తక్కువ గాక గోపురము లున్నవి. అంతియ కాక యనేకస్తంభముల వరుసలు గల యొకకూటముగూడ (వేయి కాళ్లు మండపము) నాకుఁ గన్పట్టినది.

అక్కడినుండి యెఱ్ఱ మట్టి రోడుపయినఁ బ్రయాణము సాఁగించినాము. మా త్రోవ కిరుప్రక్కలను జిన్న చిన్న పొదలు గలవు. ఆపొదలు వివిధశకుంతసంతానావాసములు. బాట కిరువైపులను చిన్నవియును బెద్దవియును నగు దేవాలయములు గలవు.

ఈబండి ప్రయాణపు టారంభమునుండి కొండ మాదిరినే యున్నది. ఎండకు మం చంతయుఁ గరఁగిపోయి యిప్పుడు పర్వత మాశిఖరపర్యంతము కానవచ్చుచున్నది.ఎఱ్ఱ మట్టి-గోధుమవర్ణపు ఱాలు-వీనితో నది మిక్కిలి యెత్తుగాను గంభీరముగాను గన్పట్టెడిని. దానిపయినఁ జెట్టు చేమ లంతగా లేదనియే చెప్పనగును. "ఇదియే పవిత్రమయిన యరుణాచల" మని నాచెంత నున్న సుబ్రహ్మణ్యయతీశ్వరుఁ డనియె. ఆయను

టలో నతఁడు మిక్కిలి భక్తిప్రపత్తులు గనుపఱచెను. ఆపేరున కర్థ మే మని నే నడుగఁగా నే ననినదే దాని యర్థమును "ఎఱ్ఱని కొండ" అని తెల్పును.ఆపేరే దేవతకుఁగూడఁ గలదు. ఆపావిత్ర్యము తెల్పఁబడున ట్లియ్యది "తిరుఅణ్ణామల" అనఁ బడు" ననియె. అప్పు డిక్కడి దీపోత్సవ మను సంగతికర్థ మే మని యడిగితి.

"సంవత్సరమున కొకసారి ఈదేవాలయార్చకులు ఆయుత్సవము గావింతురు. అప్పుడు వారు కొండ యెక్కి తచ్ఛిఖరంబున కర్పూరముతోను నేయితోను మిక్కిలి గొప్ప దీపమును వెల్గింతురు. యోజనములకొలఁది దవ్వున కది కన్పట్టును. దానిని గాంచిన వా రందఱును భక్తితో దానికి సాష్టాంగనమస్కారము గావింతురు. అప్పుడు వారి పాపములు పటాపంచ లగును. మహాదేవుఁ డద్దాని కధిదేవత." అని సుబ్రహ్మణ్యులు నాకుఁ బ్రత్యుత్తర మిడిరి.

ఏవిషయమునందయినను అకారణముగా నాకు నమ్మకము గల్గదు.కాని యిప్పుడు నాకుఁ దారసిల్లిన యీమహోన్నతమయినపర్వతరాజమునందు భక్తితాత్పర్యము లహేతుకముగా జాయమానము లగుచున్నయవి. ఈనాపరిస్థితులకు నిక్కమయిన కారణమేదియో నాకుఁ దెలియ లేదు.

"ఈపర్వత మొక సామాన్యమయిన పుణ్యక్షేత్ర మనియే కాదు. తొల్లిని దేవత లెల్లరును ఈస్థలము భూమండలంబు

నందు జ్ఞానకేంద్ర మను గుఱుతుగా ఈపర్వతము నిక్కడ నెల కొల్పియున్నారు.” అని సుబ్రహ్మణ్యులు చెప్పిన పౌరాణిక కథను చిఱునవ్వుతో నేనాలకించుచుండునంతలో శ్రీమహర్షుల వారి యాశ్రమమును జేరితిమి.

శ్రీరమణమహర్షులవారియాశ్రమ మొక దట్టమయిన తోఁటరూపున నున్నయది. ఆడంబర మంతగా లేదు గాని ఇయ్యది పర్వతమూలమునం దుండి మిక్కిలి యాకర్షకముగా నుండుటయే కాక తపస్సాధన కిట్టి స్థల మెంతయు నుచితంబని తోఁచెడిని.

ప్రవేశద్వారము నెడమప్రక్కను రెండు కొట్టము లున్నవి. వానికావల నవీనపద్ధతులతోఁ గట్టఁబడిన యొక పొడుగయిన పెంకుటికూట మున్నది. ఆయావరణమధ్య మునం దొక చిన్న జలాశయ మున్నది.

మే మాశ్రమమునఁ బ్రవేశించిన యలుకుడు విని యం దుండి కొందఱు మాకడకు వచ్చిరి. వా రనేకవిధములయిన సామాన్యసామాన్యేతరవస్త్రములతో నుండిరి. సుబ్రహ్మణ్యుల వారు పరిచయచిహ్నహాసపూర్వకముగా వారితో మా రాకను గూర్చి కాఁబోలు అరవములో మాటలాడిరి. అక్కడనుండి శ్రీమహర్షి దర్శనార్థము మేముకూటములోనికి దారి తీసితిమి. నేను ఉపాయనార్థము కొనివచ్చిన ఫలాదులనుగైకొని సుబ్ర హ్మణ్యుల వారిని వెంబడించితిని.

ఆకూటమునఁ మేము ప్రవేశింపఁగానే యందున్న సుమారిరువదిగురు జనులు ఆశ్చర్యపాటుతో మమ్ముఁ జూడ సాఁగిరి. అందలిమధ్యంబున మిక్కిలి జాగ్రత్తతో నమర్పబడిన సతల్పమగు పర్యంక ముండినది. దానిపయినం బ్రశాంత తేజోవిరాజితముగా నొక వ్యక్తి యాసీనుఁ డయియున్నాఁడు. వారే మహర్షు లని యొకరు చెప్పకయే తెల్లమయినది. సుబ్రహ్మణ్యులవా రాపర్యంకము సమీపమున కేగి సాష్టాంగనమస్కారము గావించిరి.

నేను గొనిపోయిన యుపాయనఫలములను శ్రీవారి ముందఱ నుంచితిని. శ్రీవారేమో తదేకమగ్నముగా నొక దిక్కునకుఁ జూచుచుండిరి. వారి యెదుట నొక చిన్న కుంపటిలో నగ్గి రాజుచుండినది. ఒకపీటపయి నుండు నూఁదు దానులో నూఁదువత్తు లుంపఁబడి పొగ రాజింపఁబడుచున్నవి. నే నొక చిన్న జంబుఖానాను వైఁచుకొని దానిపయినఁ గూర్చుంటిని. శ్రీమహర్షులవారు కౌపీనమాత్రధారులై యున్నారు. దేహచ్ఛాయ యెఱుపు. సరిమట్టమగు పొడవు. నెఱసిన శిరము. విశాలమయిన నెన్నుదురు. ఈ మొదలయిన యతని శారీరచిహ్నములు ప్రాచ్యముగా ననుటకన్న బాశ్చాత్యముగా నున్న వననోపు. ఆకూట మంతయు నత్యంతనిశ్శబ్దముగా నున్నది. శ్రీవారి శిష్యులలో నొక డప్పుడు పంకా త్రాడుకడకుఁ జేరి లాఁగ నారంభించెను. అట్లాసీను డయియున్న మహర్షిచంద్రుఁడు తన కన్నులను దెఱచికొని మిక్కిలి

నైశ్చల్యనైశ్శబ్ద్యములతో దేనినో చూచుచున్నాఁడు. నా రాకనుగూర్చి యేమాత్రమును గమనించినట్లు లేదు. మదరాసులో నే నొక మౌనస్వాములవారిని సందర్శించియుంటిని. వారికిని వీరికిని బోలిక నా కగుపట్టుచున్నయది.

చూపులనుబట్టి మన మొకరి మానసికభావములను దెలిసికొనవచ్చునని నాకుఁ దెలిసిన సంగతి. కాని యీమహానుభావుని చూపు లట్లు గాక నావంటి వానిని గలంచివేయుచున్నయవి. ఆకూట మంతయు నెంతయో నే పారీతిగా నిశ్శబ్దముగా నుండినది. నే నుంచియుండిన యుపాయనము గూడ నౌదాసీన్యమునే యంది యక్కడ నుండినది.

ఈమహర్షీంద్రుఁ డీరీతిగా మన కగుపించు నని నా మిత్రులయిన సుబ్రహ్మణ్యులు చెప్ప లేదు. పాశ్చాత్యతత్త్వసంపన్నుఁడనయిన నేను బహుశః "ఇయ్యది భక్తరక్షణార్థము వేషము కాఁబోలు"నని సాక్షేపముగా తలంచితిని. కాని మదియం దుప్పతిల్లిన యాభావమును బాఱఁజిమ్మి యది ధ్యాననిమగ్నత్వ మని నిశ్చయించితిని. ఈ విషయమునుగూర్చి నామిత్రము చెప్పకుండినను ఇది యింతే" దీనినిగూర్చి యిద మిత్థ మని తెల్పఁజాలను.

నిశ్చయముగా ఈమహామహుని సన్నిధిలో నే నయస్కాంతముచే నినుమువోలె లాఁగబడుచున్నది. వారిచూపు నుండి నేనెంతగాఁ బ్రయత్నించినను నాహృదయమును నా

చూపును బ్రక్కకుఁ దిగిచికొనలే కున్నాను. రయిలులో నాకుఁ దోఁచిన యాధ్యాత్మికసందేహము లన్నియును ఈ శ్రీవారిదృష్టి ననుభవించుచున్నప్పు డవి తమంతటఁ దామే మాయమయినవి. నాకడను బ్రశాంతిప్రవాహ ముండుటను గమనించితిని. లేనిపోని యాలోచనలచేఁ గలఁతనొందు మన్నవంబునకుఁ బ్రశాంతి చేరుకొనుచున్నయది.

నిక్కముగా నాకు ముందుఁ దోఁచియుండిన యనుమానములును నాకుఁ గల్గియుండిన యాధ్యాత్మికానుభవమును ఈమహాతేజోనిధియొక్క జ్ఞానతేజఃపుంజమునెదుటను లెక్కకును బక్కకును రా నట్లయినవి. ఈరీతిగా రెండు గంటలకు మించి నైశ్శబ్ద్యమునఁ గడచినది గాని నామనస్సునందు తత్సంభవమునుగూర్చి యసంతృప్తిగాని కించగాని కల్గ లేదు. నాకు నెన్నివిధములుగానో సందేహనివృత్తి గల్గుచున్నప్పుడు నేను మనంబునఁ గొఱంత నందవలసిన పని యే మున్నది. ఆధ్యాత్మికసౌరభ మీాతనినుండి పుష్పమునుండి తావింబోలె వ్యాపించెడిని.

ఆధ్యాత్మికతత్త్వమునుగూర్చి యిదమిత్థ మ్మను నిర్ణయమును నేను జేయరా దను నంశము నెఱుంగుదును. కాని యిక్కడి యనుభవమున - శ్రీమహర్షులవారు నాతో నెట్టి సంభాషణమును నెట్టి ప్రశ్నోత్తరములను జరుపకపోయినను వారి యంతరాత్మనుండి మదీయాత్మలోనికి నిట్టిది యట్టిది యని

చెప్పరాని యొక ప్రవాహము ప్రవర్తించుచున్నట్లు తోఁచినది. దీని సాధనసంపత్తి యెట్టిదో వివరింప పీ ల్గాదు.

ఇంతలో నొకరు నాకడకు వచ్చి స్వామివారి నేమయినను బ్రశ్నింప నిచ్చ గలదా యని రహస్యముగా నన్నడిగిరి.

కాని - మిక్కిలిగా లటపటధ్వనిమయమయిన యైహిక వాతావరణమునందుఁ గొట్టుకొనుచు శాంతి యను వస్తు వెట్టిదో యెఱుంగని నేను శాంతిసౌధము నెక్కి విహరించుచున్నాఁడను. మదీయభావనౌక యిప్పుడు ప్రశాంతిమహా సముద్రమున శాంతిప్రయాణము సాగించుచున్నది. నాకు నైహికత్వతీరమునందలి కీకరబాకర ప్రశ్నలతో నేమి పని?

ఇప్పటికి అందు నుండిన ప్రశాంతికి భంగము కల్గినది అక్కడ నుండిన వారిలో నొక రొక్కరు లేచి బయలుదేఱ సాఁగినారు. శ్రీమహర్షులవారు తమ ధ్యానసమాధి చాలించి నన్నొక చూపు చూచినారు. ప్రశ్న నడుగు మని యింతకు ముందు నన్నడిగిన యతఁడు ఆవిషయమునుగూర్చి మరల నన్ను ప్రకాశముగాఁ బ్రశ్నించెను. కాని శ్రీమహర్షులవారి చూపులో "మీ ప్రశ్న లన్నియు మౌనపద్ధతిగానే జరగవలయు"నను భావ మున్నట్లు నాకుఁ గోచరించినది. సంపూర్ణ ప్రశాంతి యేదియో యది లభించినప్పుడు చిల్లర యనుమానము లుండునా? నేను శాంతిలో నోలలాడుచున్నాఁడను. ఇప్పటికేమో నా కేదియు నడుగవలెనని లేదు.

మధ్యాహ్న భోజన మయినతరువాత నెండ బాగుగా నెక్కినది. కూటములోనుండి యనేకులు విశ్రాంతికై వెడలి యుండిరి. ఆసమయమునందు శ్రీమహర్షులవారు కూటములో నొంటరిగా నుండిరి. ఒక శిష్యుఁడు పంకా లాఁగుచుండెను. శ్రీవా రొక వ్రాఁతపుస్తకములో వ్రాసిన తరువాత నొక శిష్యునితో నరవముతో ముచ్చటించిరి. ఆశిష్యుఁడు నా కిట్లు వక్కాణించెను.

“మీ యూరోపుఖండవాస్తవ్యుల యలవాట్లప్రకార మిక్కడ నాహారములను గుదిరింపఁజాలనందులకుఁ శ్రీవారు చింతనొందుచున్నారు.”

అందులకు నే నిట్లంటిని. “శ్రీవారికి నమస్కారము. కారము లేని వస్తువులను నే నుపయోగించుకొనఁగలను. నేను వచ్చినవిషయముయొక్క ప్రాముఖ్యమును బట్టి చూడఁగా తిండి సౌఖ్యము లెక్కింపఁదగినది కాదు.”

శ్రీవారు “మంచి”దనిరి. దానితో నా కుత్సాహ మెచ్చయినది.

అప్పుడు నాకును శ్రీవారికిని ఈరీతిగా సంభాషణము జరగినది:—

“ప్రభూ! పాశ్చాత్యపద్ధతులలోఁ గల యాధ్యాత్మిక జ్ఞానబోధకములయిన గ్రంథము లన్నింటిని నేను బఠించినట్లే. అంతియేకాక ఆదేశములయందలి యనేకులగు యాధ్యాత్మిక

విజ్ఞానవేత్తలు నాకుఁ బరిచితులు. అట్టి వారితో నెంతో పరిశ్రమ గావించియున్నాఁడను. అనేకపర్యాయము లేకాంతస్థలములకు వెడలి యెంతెంతో గాఢముగా నాలోచించియున్నాఁడను. ఇంకను జ్ఞేయంబైన సంగతి నెఱుంగుటకై యీ పూర్వార్థగోళమున కేతెంచినాను."

నావుడు మహర్షులవా రావిషయము తమకుఁ దెలిసిన దన్నట్లు తల యూఁచిరి. అంత నే నింకను ని ట్లంటిని.

"నే నెన్నో సంగతులను సిద్ధాంతములను నాలకించితిని. అవి యన్నియును బోదలవలె నన్నుఁ జుట్టుకొన్నవి. కాని యనుభవమునఁ జూడఁగా అవి సరిగా సరిపడుట లేదు. నాయాచారపరత్వము చాల లేదా? లేక మానవాతీతమయిన వస్తు వేదయిన నున్నదా? అట్లున్నచో దాని నెట్లు కనుగొన సాధ్య మగును?"

అప్పు డక్కడ నుండిన ముగ్గురు నలుగురు శిష్యులాశ్చర్యభరితు లయిరి. నే నంతస్ఫుటముగాను సుద్రేకముగాను శ్రీవారితో మాటాడియుండిఁగూడ దేమో యనిపించినది. ఏండ్లుగా నామనస్సునందుఁ జేరుకొని వేధించుచు సందేహ మీరీతిగా నా ప్రయత్నము విశేషముగా లేకయే వెల్వడినది. శ్రీవారు సత్పురుషులే యయిన మాట నిక్కమయినచో ఈ లేనిపోని పయిని లోపములను లెక్కింపరుగదా?

అప్పుడు శ్రీవారు నాకెట్టి ప్రత్యుత్తరము నొసంగక

యాలోచననిమగ్ను లయియుండిరి. నే నింకను నావక్కా-
ణింపును సాగించితిని.

"మావైపున నుండు జ్ఞానులు వారి తెల్వితేటలకు మిక్కిలి మన్నన నందియున్నారు. కాని యీజీవితముగాక పరవస్తువుగా నుండు దానిని వారేమాత్రమును దెల్పఁగల్గ లేదు. మా పాశ్చాత్యర్షీంద్రులు తెల్పఁజాలని సంగతు లనేకము లీప్రాచ్యఖండమున వెల్వడఁగల వని నాకు వినఁబడినది ఈవిషయ మేమయిన మీనుండి సాధ్య మగునా? లేక నే నీ ప్రయత్నమును చేయుటయే వ్యర్థమా?"

నాప్రశ్నింపయిపోయినది. శ్రీవారినుండి జబాబురావలసియున్నది. వారదే పనిగా నన్నుభావగర్భితదృష్టితోఁ జూడనారంభించిరి. పది నిముసములకు వా రిట్లనిరి.

"నీవు "నేను". అనుచున్నావే. ఆ "నేను" ఎవరో తెల్పుదువా?" అని వా రింగ్లీషులోనే ప్రశ్నింపగా నే నచ్చెరువుచే దిగ్భ్రాంతుఁడ నయితిని. నే నపు డిట్లంటిని.

"మీప్రశ్న నా కర్థము గాలేదు"

"నే నడిగినది తేఁట గాలేదా? పర్యాలోచింపుఁడు."

అప్పుడు నే నాలోచింపఁగా నొక భావము తళుక్కున నాలో మెఱసినది. నన్ను నేను జూపుకొని నాపేరు చెప్పితిని. వా రిట్లు ప్రశ్నించిరి?

"అతఁడు నీకుఁ దెలియునా?"

"ఓ, నాజీవితమునుబోలినంత తేటగా దెలియును" అని చిఱునవ్వుతో నంటిని.

"కాని అది నీశరీరముమాత్రమే యగును. నీ వెవఁడవో?" మరల నాలోచింపుము.

ఈయద్భుతప్రశ్నకు నేను బ్రత్యుత్తరము చెప్పలేక పోఁగా శ్రీవా రిట్లు తమ నుడిని సాగించిరి.

మొదట ఆ "నేను" నెఱుంగ నగును. ఆపయిన తత్త్వ మంతయు నర్థమగును."

నామనస్సు మరలఁ చిక్కులోఁ బడిపోయినది. అప్పుడు శ్రీవారు మరల భాషాంతరీకర్తదార్వమున నాకు నిట్లనిరి. "నీలో నీవు సరిగఁ బరికించుకొనినచో నీవు వచించిన సమస్తమయిన ప్రశ్నలకును బ్రత్యుత్తరములు లభింపఁగ్గలవు."

ఇది నాకుఁ జిత్రముగాఁ దోఁచి యిట్లు వచింప సాఁగితిని.

"నేను ఏమి ఎట్లు చేయవలయును?"

"తనలో తాను అగాధముగా పరికించుకొనుటచేతను పలుమారుసమాధిగా ధ్యానించుటంజేసియు ఆవెల్తురుఁ గాన నగును."

"తత్త్వమునుగూర్చి యెన్నియోసారులు నేను ధ్యాననిమగ్నుఁడ నయి యాలోచించినాఁడను. జ్ఞానప్రదీపకాంతి శకలమయినను నాకుఁ గనుపట్ట లేదు."

"ఆధ్యాత్మికపరిజ్ఞానాభివృద్ధి కాలేదని చెప్పుటకు సాధ్యమగునా? ఆధ్యాత్మిక ప్రపంచములో నొక రభివృద్ధి చెందుచున్నదియును లేనిదియును జెప్పుట సులభసాధ్యము కాదు."

"అందులకు గురుసాహాయ్య మవసరమా?"

"కావచ్చును."

"మీరు చెప్పు రీతిగా తన్నుఁదా నెఱుంగునట్లు చేయుటకు గురుఁ డుపకరించునా?"

"ఈవిషయమునఁ గావలసిన దంతయును గురునివల్ల లభింపఁగలదు. అది యాత్మానుభవమునఁ దెలియఁగలదు."

"గురుసహాయమున జ్ఞానవికాస మెన్నాళ్లకుఁ గల్గును"

"అది యంతయు జిజ్ఞాసువుయొక్క పరిపక్వతనుబట్టి యుండును. తుపాకి కాల్చుట క్షణము. కాని దాని మందు తయారు చేసి ధట్టించుట కెంత సేపు పట్టునో చూడుము."

గురువుల పద్ధతులనుగూర్చిన యీసంభాషణ మహర్షులవారి కిష్టముగా లేనట్లు ఆసంభాషణవల్ల నా కర్థమయినది. అయినను మన్మనోగతమయిన సందేహముయొక్క బలమునం జేసి నే నవ్విషయమునుగూర్చియే ప్రశ్నింప నుంకించితిని. అంతటిలో వారి ముఖ మాచెంతను గల గిరీంద్రమును దర్శించుచుండెను. దానినిబట్టి యాసంభాషణము నిల్పవలయునని నాకుఁ దోఁచి యిట్లు ప్రశ్నించితిని.

"ప్రకృతము కాలము మిక్కిలి చిక్కుగా నున్నది గదా? దేవరవారు భవిష్యత్కాలపరిస్థితులనుగూర్చి తమయభిప్రాయములను దెల్పుదురా?"

"ప్రకృత ముందు స్థితిగతులే మనకు సరిగాఁ దెలియ వన్నప్పుడు రాఁబోవు స్థితిగతులనుగూర్చిన గొడవ యెందుకు? ప్రస్తుతమునుగూర్చి జాగ్రత్తపడినచో భవిష్యత్తు తనంతఁ దానే భద్రపడఁగల" దని శ్రీవారు సాక్షేపముగా వచియించిరి.

ఇది నే ననుకొన్నట్టి రకపు జబాబులలో మఱియొకటి. కాని నే నంత తొందఱగా లోఁబడు వాఁడను గా నిప్పుడు. అరణ్యజీవనమయిన యిందలికంటె నే నుండు ప్రదేశమునందు జీవిత సమస్యయొక్క బాధయును నొత్తిడియును బలపత్తరముగా నుండును. కాఁబట్టి మాకు జీవితమునుగూర్చి మాయొక్క హృదయము లెక్కువ యాందోళన నందుచుండును. కనుక నేను ప్రశ్నింప సాఁగితిని.

ఈ ప్రపంచమునం దొకల్లొకరిక శాంతిస్నేహములు కుదిరి పరస్పరసాహాయ్యములు గావించుకొను స్థితి యేర్పడునా? లేక యంతయు నెగుడుదిగుడు లయిపోయి తొందఱలెచ్చునా?"

ఈ నాప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పుట కిచ్చను సూచింపనప్పటికిని శ్రీవా రిట్లు చెప్పసాఁగిరి.

"లోకంబును బరిపాలించు వాఁడు పరమాత్ముఁడు: దాని మంచి చెడ్డలను విచారించుకొను పని యతనిది. లోకంబునకుఁ బ్రాణ మొసంగిన వ్వాఁడు దాని నెట్లు కాఁపాడవలయునో యెఱుంగ కుండునా? దాని భార మతనిది కాని నీది కాదు."

మనము చుట్టుపట్ల సాలోచనముగాఁ గాంచినచో ఈరీతిగాఁ దలపోయవలసినఁ కారణ మగుపడునా?

ఈమాటలను మహర్షిగా రింకను నసంతృప్తిగా నిట్లనిరి.

"లోకము-అందు నీవు నిన్నుగూర్చి నీకుఁ దెలియనప్పుడు లోకమునుగూర్చి తెలిసికొనఁ బ్రయత్నించుటలో నేమి ప్రయోజన మున్నది? ఈవిషయమునుగూర్చియే తత్త్వజిజ్ఞాసువు లాలోచింపరు. ఇట్టి ప్రశ్నలపయినంతయును జనులు తమ శక్తిని వ్యర్థము గావించుచున్నారు. తొలుతను నిన్నుగూర్చిన సంగతిని నీవు కనుగొనుము. అప్పుడు గాని నిన్ను నీవంటివారిని గలిగియున్న ప్రపంచముయొక్క సంగతి నెఱుంగుటకు నీకెక్కువ యర్హత లభింపదు."

అని శ్రీవారు తమ భాషణమును దటాలున నాఁపినంత నొక శిష్యుఁడు వచ్చి యూఁదువత్తి నంటించి యుంచెను. శ్రీవారు దాని నీలధూమమును తదేకదృష్టిగాఁ గాంచుచుండి తమ వ్రాఁతపుస్తకమును గైకొని తెఱచి యం దేదో వ్రాయఁ

బూనిరి. అనఁగా నాతో సంభాషణము నప్పటికిఁ జాలించి రన్న మాట. ఈరీతిగా వారు నాయెడల నొక విధమయిన యౌదాసీన్యము వహించినట్లు తోఁచినది. అది నాస్వాతిశయ మునకుఁ బ్రాయశ్చిత్తముగా నగుపించినది. ఇంకొక కాలు గంటసే పక్కడఁ గూర్చుండి వా రప్పటిలో నీకుఁ బ్రశ్నోత్త రముల కియ్యకొన రని యెఱింగి, యప్పటి కా మా సంవా దము ముగిసినదకాఁ దలంచి యా పెంకుటి భవనమును వీఁడువాఁడనై సనమస్కారముగా సెల వందితిని.

బండికొఱ కొకని నూరిలోనికిఁ బంపి యుంటిని. దేవా లయమునకు వెళ్ళి చూడ నాకుఁ గోరిక. ఎద్దులబండి చూచుట కందముగానే యుండును గాని, దాని వేగము అతిన్యూన మగుటచేత గుఱ్ఱముబండికొఱకు పంపియుంటిని. ఇంతలో నొక పొట్టి గుఱ్ఱపుబండి వచ్చి నాకై వేఁచినది. అందు నెత్త యిన యాసనము లేమింజేసి యెట్లో కూర్చుంటిని. అప్పుడు భీకరస్వరూపుఁడయిన తత్సారథి రక్తవర్ణోష్ణీషమును చిరు గుల దోవతిని ధరించి ప్రత్యక్షమయ్యెను. కొంతవడికి దేవా లయద్వారముకడఁ జేరుకొంటిని. అందుఁ నొక రీతిగాఁ బరి శోధింపఁ బూనితిని.

ఆ శ్రీమదరుణాచలదేవాలయ మెన్ని యేండ్ల నాఁటిదో చెప్ప నాకుఁ దరముగాదు కాని యోచింపగాఁ గొన్ని వందల యేండ్ల నాఁటిదని తోఁచెడి నని నావెంట వచ్చిన యతఁడు వచియించినాఁడు.

దేవాలయసమీపమునందు దానినిజుట్టుకొని కొన్ని చిన్న చిన్న దుకాణములున్నవి. అవి యందముగా నున్న వసందగును. ఆవీధులు తాళ్లచేతను టెంకాయచెట్లచేతను సలంకరింపఁబడి యున్నవి. దేవాలయము నింకను సమీపించుటను మిక్కిలి చిన్నవగు దుకాణము లున్నవి. అందు దేవతల పటములు విగ్రహములు మున్నగునవి యమ్మఁబడుచున్నవి. ఇతర పుణ్యస్థలములయందుఁ గల యంగళ్లలో శ్రీరామునియొక్కయును శ్రీకృష్ణునియొక్కయును విగ్రహములు ముఖ్యముగా నమ్మఁబడుచుండును. ఇక్కడ శైవవిగ్రహములకుఁ బ్రాముఖ్యముండుటను గాంచుచున్నాఁడను. అప్పుడు నావెంట వచ్చిన యతఁ డిట్లు తెల్ప నారంభించెను!—

"మాయొక్క మతపురాణముల ప్రకారముగా ఈ యరుణాచలముపయిన శంకరుఁడు తొల్లిని నొక యగ్నిజ్వాల రూపమునఁ గన్పట్టినాఁడు. ఈవిషయముయొక్క జ్ఞాపకార్థముగా పూజారులు ప్రతిసంవత్సర మీకొండశిఖరమునఁ బవిత్రజ్వాలను వెల్గింతురు."

ఈవిషయము వేలకొలఁది వత్సరములక్రింద జరగియుండును. తద్గౌరవార్థముగా నీదేవాలయము కట్టఁబడియుండును. ఏఱు కందురా? శంకరుఁ డింకను ఈగిరీంద్రమునందు మక్కువమై నున్నాఁడు.*

---

* పాశ్చాత్యులమగు మాకీదేవత లెల్లరును మతాభిప్రాయములయొక్క విచిత్రవ్యక్తీకరణ మని తోపవచ్చునుగాక. కాని హిందువులు అట్టి దేవతలు వర్తించుచున్నారనియే విశ్వసింతురు.

కొందఱు యాత్రికులా యంగళ్లకడ నున్నారు. ఆ దుకాణములయందు దేవతలయొక్కయి త్తడివిగ్రహములే కాక పటములును వారినిగూర్చిన చరిత్రములును స్తవతత్త్వ వర్ణనాదులుగల ద్రమిళాంధ్రగ్రంథములును బొట్టు పెట్టుకొను (విభూతియుండలు కుంకుమ మొదలయినవి) వస్తువులును గలవు.

మిక్కిలి వికారస్వరూపుఁడైన యొక కుష్ఠరోగి భిక్షుకుఁడు నన్ను సమీపించెను. వానియందు దయ వహించి వాని కొఱకొక నాణెమును నేలను వైచితిని.

ద్వారముపయిన నొకసార్థవాహపురక మగు బొమ్మయున్నది. దానిపయి నుండు బ్రహ్మాండమయిన గోపుర మీజిప్టులోనిపిరమిడులను దలపించుచున్నది. కాని వీనిపయిన మొనదేలక నహాటుగానున్నది. ఈగోపురము పది మయిళ్లు దవ్వులకుఁ గనుపడును. దీని ముఖభాగమునం దెన్నియో ప్రతిమలుగలవు. అవి యన్నియుఁ బౌరాణికములును మతసంబంధములును అందు తపోనిష్ఠయందును ఆలింగనబంధంబులయందును నుండు విగ్రహములు గలవు. ఈరీతిగా శాంతి శృంగారముల ద్వైవిధ్యము గలదు. దీనం జేసి హిందూమతమునఁ బ్రకృతిసంబంధములయిన యన్ని యభిరుచులకును దావున్నదని తోఁచెడిని. దేవాలయములోనికిఁ బ్రవేశింపఁగా నొక మిక్కిలి పెద్దదగు చదురపు టావరణము. అందుఁ గోపురములు గలవు. మంటపములు గలవు. కూటములు గలవు.

విగ్రహములు గలవు. పయికప్పు గలవియు లేనివియు నగు భాగము లెన్నియో కలవు. వీథీస్కకడఁ గల కూటములను జూచినచో నెట్టియాశ్చర్యతన్మయత్వము గల్గునో యట్టిది యిక్కడ నొక్క కూటమును గాంచినఁ గల్గఁగలదు. అది యొక శిలామయమయినది. చీఁకటి కొంచెము విశేషముగానే కలదు. అంతయు నిర్మానుష్యముగా నున్నది. గోపురముల పైట భాగము ఎట్టిని ఱాలతో నున్నను లోపలనంతయు గని ఱాయిమయముగా నున్నది. ఆయావరణము దాఁటి లోపలి యావరణమును బ్రవేశింపఁగా సహస్రస్తంభమంటపమును నాయనుయాయి చూపినాఁడు. కాలమునఁ జేసి బూది రంగు వాఱిన యందలి శిల్పమును గాంచితిని. ప్రతిస్తంభము నొకఱే శిలతోఁ జేయఁబడినది. ఈశిల్పములోఁగూడ దేవతలయొక్కయును సామాన్యాసామాన్యజంతువులయొక్కయును బ్రతిమలు గలవు. ఈమంటపము లోపలిభాగము మిక్కిలి చీఁకటిగానే యున్నది. అక్కడక్కడఁ బ్రమిదలలో నాముదపు దీపములుగలవు.

ఇంకను లోపలి ఆవరణమునకు వెడలినాము. అక్కడనే ఇంతకుముందు నేఁ జెప్పిన అయిదు చిన్నగోపురము లున్నవి. అవి మొదటఁ జెప్పిన గోపురముల పద్ధతివి కావు. ఇందలి విగ్రహాదికము మంటితోఁ జేయఁబడి పయిన గచ్చు వేయఁబడినది ప్రధానదేవత యుండు నావరణమునందుఁ బ్రవేశించి యందు నుండు ప్రదక్షిణకూటములయందు సంచ

రించితిని. అవి యంతయుఁ గొంచె మెక్కువ చీఁకటిమయ ముగా నుండినను గంభీరములుగాను విశాలములుగాను మనో జ్ఞములుగాను నున్న వనవలయును. ఇంతలో నక్కడి ప్రధా నదైవతంబయిన శ్రీమదరుణాచలేశ్వరుని సన్నిధిని సమీా పించితి మనియు అంతకు లోపలికి యూరోపియనులు వెడలఁ గూడ దనియు నావెంట నేతెంచిన యతఁడు తెలిపెను ఆ లోపలినుండిమృదంగాదివాద్యధ్వానములునుమంత్రోచ్చారణ నినాదములును విన నయ్యెను. నేను ద్వారముకడ నుండియే కాంచఁ బ్రయత్నింపఁగా నాకు ఆరతిజ్వాలలును ప్రస్ఫుట మయిన విగ్రహారీతియుఁ గానఁబడినవి నాయనుయాయి యభి ప్రాయముప్రకార మక్కడినుండి బయలుదేఱి క్రమముగా దేవాలయము వెలికి వచ్చితిని. త్రోవలోఁ జక్కగా త్రిశూల రూపమయినతిలకము దిద్దుకొని యొక బ్రాహ్మణుఁడు మామా ర్గమునకు మధ్యమున (ఆదేవాలయావరణములోనే) కూర్చుండి యుండెను ద్వారము వెలికి వచ్చినప్పు డక్కడి యంగట నున్న యతడు నే నేమయినఁ గొందునని యాస నొందెను.

ఆయూరిని బాఱఁజూడఁగాఁ గొంత దూరములోనే యొకమనోహరమయిన చలువఱాళ్లమసీదు కానఁబడినది. నే నక్కడికి వెడలితిని. అంతయు మనోహరముగాను మనశ్శుద్ధి కరముగాను నున్నది. నేను నాపాదరక్షలను దీసివైచి లోనఁ బ్రవేశించితి. లోపలఁ గొందఱే ప్రార్థయితలుండిరి. వారు చిన్న చిన్న జమఖానములను బఱచుకొని దానిపయిన సాఁగిల

పడుచు నమాజు చేయుచుండిరి. దేవునకును మనుజునకును మధ్యవర్తి యెప్పుడు నుండఁడని వారి ప్రవక్తయొక్క యా శాసనము. ఆముసల్మానుమతము ప్రకారము మక్కా మొగముగాఁ దిరిగినప్పుడతఁడుఒకని నెక్కువగాను ఒకనిని దక్కువగాను లెక్కింప బని లేదు. ఎల్లరును బరమాత్మ దృష్టిలో సమానులే.

అక్కడినుండి మహర్షి దర్శనాభిలాషినై ఆయూరి వీధులలోనుండి యేతెంచితిని. అందు పండ్లు భోజనవస్తువులు మిటాయిదినుసులు నగలు మొదలయిన వానిబేరముల యంగళ్లుండినవి. అట్లు వెళ్లునప్పుడు మఱి యొకసారి యరుణాచల దేవాలయమును గాంచఁగా దాని తొమ్మిది గోపురములు విహాయసమునఁ జెలంగి యొక్కుమ్మడిగా నాహృదయమునందీజిప్టులోని పిరమిడుల జ్ఞప్తినిగొల్పినవి. నిక్కము. ఈదేశమునందలి దేవాలయములను ఇండ్ల పద్ధతిని అందలిగోడల లావగు రీతిని-ఇండ్లయొక్క యెత్తుతక్కువను గాంచఁగా - ఈదేశమునకును ఈజిప్టునకును బోల్కి యున్నట్లు నాకుఁ దోఁచెడిని.

ఈదేవాలయాదు లిట్లే స్థిరముగా నుండునా? లేక యివన్నియుఁ గాలక్రమమున నేలపా లయినచో మరల నిట్టివో లేక మఱెట్టివో దేవాలయాదులిక్కడ నేర్పడునా? యను భావము నాయందుఁ బొడమినది.

నే నింతలో నాశ్రమమును సమీపింపసాగితిని. సాయంకాల మగుచుండెను. రవిబింబం బస్తంగతం బగుచుండినది. నిక్కముగా భూమధ్యరేఖాప్రాంతమునందలి సూర్యాస్తమయము చాలమనోహరంబయిన దనియును కళాస్ఫోరకం బయిన దనియును భావోజ్జీవకరంబయిన దనియును జెప్పక తప్పదు.

ఆకురాలు కాలమునందలి సాయంకాలములు చాల పొడవుగా నుండుట మాయూరోపులోని యనుభవము. ఇక్కడ నట్లు గాక పడమటి దెసయంతయు సంజకెంజాయచే నలంకృతంబై సూర్యబింబం బొక యెఱ్ఱని యగ్నిగోళంబుం బోలెం జూపట్టును. చీకటి ప్రారంభమయినది. గోవుల యొక్క యలజడియును పక్షులయొక్క కలకలమును దగ్గి పోయినవి.

ఈచీకట్లు ప్రారంభమయినట్లేకదా యొకజీవి జీవితములోని కష్టదశ ప్రారంభమగును? మిణుగురుపురుగుల సంచార మాశ్రమభూమియందుం బ్రారంభమయినది. నేను మహాత్ముల వారి కూటమును జేరి యం దొకచో నుపవిష్టుండ నయితిని. శ్రీవారు తమ సోషాపయిన మామూలుగా పద్మాసనమునం గూర్చుండి మిక్కిలి గంభీరముగానుండిరి. వారు తమదృష్టిని మిక్కిలి యేకాగ్రముగా నిగిడించి యుండిరి. పయిం జూడంగా అంతరించిపోవుచున్న సంజకెంజాయను వారు గాంచు

చున్నట్లు గనుపించినది. వారి శిరం బప్పు డొక సమాధి గతుండయిన యోగిశీర్షమునుంబలె సునిశ్చలంబై యుండినది. వా రిట్టి దృక్కు నవలంబించినప్పుడు అస్మాదృశుల కయ్యది యిదమిత్థ మని యర్థము కాదు.

నే నక్కడ నొక్కెడఁ గూర్చుండి శ్రీవారి వంకఁ జూడ సాగితిని. ఇంతలో చిన్న కలఁత నిదుర ప్రారంభమయి నాకనులు మూఁతలుపడిన ట్లయినది. ఆనిదురయందు శ్రీమహర్షులవారియొక్క ప్రభావకిరణముల నాలోని కెక్కువగాఁ జొచ్చుకొనిపోవునట్లుగాఁ దోఁచినది. అప్పుడు నా కొక స్వప్నము వచ్చినది:— నేనయిదేండ్ల బాలునియంత వాఁడ నయితిని. శ్రీమదరుణాచలమును జుట్టుకొని యుండు నొక డొంకత్రోవలో నేను నిల్చుకొని యున్నాను. అప్పుడు నేను శ్రీమహర్షి చేతి నూతఁగాఁ బట్టుకొని యున్నాను. శ్రీవారు అప్పుడు మామూలుగా మనకుఁ గనుపడు పరిమాణముకన్న మిక్కిలి పెద్దగా నున్నారు. వా రప్పుడు నన్ను తమ యాశ్రమమునుండి మిక్కిలి గాఢాంధకారములో మెల్లగా నడిపించుకొని పోవుచున్నారు. చంద్రుఁడును నక్షత్రములును గ్రుడ్డివెన్నెల గాయుచున్నవి. గండశిలలమధ్యమునను వంకరటింకరత్రోవలయందును శ్రీవారు నన్ను మిక్కిలి జాగ్రత్తగా నడిపించుకొని పో సాఁగిరి. ఏమాత్రము కలతఁ కల్గినను ఆశిలలు దొరలవచ్చును. ఆడొంకత్రోవనుండి నేను జారవచ్చును.

అక్కడక్కడ ఆత్రోవలో మాకుఁ జిన్న చిన్న ఋష్యాశ్రమములు కానవచ్చుచున్నవి. అందలి వారు మమ్ములను బేర్మితో నెదుర్కొని సత్కారమ్ము గావించుచున్నారు. ఆచంద్ర నక్షత్రముల గ్రుడ్డి వెల్తురులో వారి రూపములు నాకు చక్కగాఁ గానుపింపకపోయినను వా రందఱు వివిధ రూపంబులనున్న యోగీశ్వరు లని నా కర్థమయినది. మే మెక్కడను నిల్వక పోయి పోయి ఆగిరిశిఖరమునకుఁ జేరుకొని యక్కడ నిల్చితిమి.

అప్పుడు మహర్షిగారు తల వంచి నన్నుఁగాంచిరి. ఏమో చెప్పనుండి రని నేనును వారి మోమువంకఁ జూడసాఁగితిని. నాహృదయాంతరాళము నందలిభావము లన్నియు నత్యద్భుతముగా మార్పు నొందినవి. అంతవఱకు న న్నంటి పట్టుకొనియున్న యభిప్రాయము లన్నియును నన్ను వదలి పోయినవి. ఏయభిలాషలతో నత్యంతమగు తొందఱగా నే నిక్కడనుండి యక్కడకు అక్కడినుండి యిక్కడకుఁ బరువెత్తితినో ఆకోర్కె లన్నియును నిమిషార్థమునఁ బలాయన మంత్రము పఠించినవి. ఇతరులనుగూర్చి నాకుఁ గల యీర్ష్య అసహనభావము, అనిష్టత, స్వార్థపరత్వము మొదలయిన నాలోని దుష్ప్రవృత్తు లన్నియును ఆక్షణమునందే పటాపంచలయిపోయినవి. ఇది యిట్టిదియని నిర్వచింపరాని యొకవిధమయిన ప్రశాంతభావము నాభావమునందుఁ జేరినది. ఇంకను నాజీవితమునకు సంబంధించిన యనుమానము లేవియును లేవు.

అప్పుడు శ్రీమహర్షులవా రకస్మాత్తుగా నన్ను కొండ దిగువకుఁ జూడు మని యాజ్ఞాపించిరి. నే నట్లు గావింపఁగా, అందు భూమండలమునందలి పశ్చిమార్ధగోళము వ్యాపించు కొనియుండుటను గాంచితిని. అక్కడఁ గోట్లకొలఁది జనులు చీకటిలోఁ గప్పువడి యుంటం గాంచితిని.

అప్పుడు శ్రీమహర్షులవారు ప్రశాంతమధురస్వన ముతో నా కిట్లనిరి.

"అన్నా! నీవు ఆనీదేశమునకు వెడలినచో అక్కడను నీ విప్పు డనుభవించుచున్న శాంతిని నీ వనుభవింపఁగలవు. కాని యాశాంతి నీకుఁ గావలయు నన్నచో ఈ నీ దేహము గాని అందులోని బుద్ధిగాని నీవు అనెడిభావమును నీవు వదల వలయును. ఈశాంతి నీకుఁ గల్గినప్పుడు నిన్ను నీవు మఱతువు. అప్పుడు నీజీవితము పరతత్త్వమునకు నభిముఖ మగును.

అప్పుడు మహర్షిగారు వెన్నెలకాంతుల నీను నొక సూత్రపు మొన నొకదానిని నా చేత నుంచిరి. అప్పుడు నే నాయత్యద్భుతంబయిన స్వప్నావస్థనుండి జాగ్రదవస్థను జెంది తిని. కాని ఆస్వప్నమునందలి విషయ మంతయును చక్కని జ్ఞప్తిలో నున్నవి. నే నప్పుడు మహర్షులవారిమోమును గాంచి తిని. వారు నామోమువంకఁ దదేకదృష్టిగాఁ గాంచుచుండిరి.

ఆకల యయినతరువాత ఈజీవితమునందలి దుఃఖము లును అసహ్యతలును విస్మృతము లయినట్లు తోఁచినవి.

నాకు నన్నుఁగూర్చిన నైస్పృహ్యమును నేను కలలోఁ గాంచిన నాటి వారలయెడ ననుతాపమును స్వప్నానంతరమ యిన యిప్పుడునునన్ను విడనాడకున్నయవి.

స్వప్నమునుండి నే నిట్లు మేల్కొనఁగా ఆసూటము లోని వా రందఱును శయనార్థము వెళ్లుటకై లేచుచుండిరి. నేను నందుకే బయలుదేఱితిని. కొట్టములో నిదురించుటకు నుక్కగా నున్నందున నేను బయలునందు శయనింపఁ దలంచి తిని శ్రీవారి శిష్యులలో నొకరు ఒక లాంతరును దెచ్చి నా కొసంగి దానిని సమీపమున నుంచుకొని పరుండవలయు ననియు లేనిచో దుష్టమృగములు సర్పములు సమీపింపవచ్చు ననియును చెప్పిరి.

ఎండఁ గాలిన ఆకటికనేలపయినఁ బడక గిడక లేక నేను పరుండఁగా, ఎన్నో గంటలవఱకు నాకు నిదుర రా లేదు. నే నివి యంతయును లెక్కింపక ఆలోచింప సాఁగితిని. ఆలో చింపఁగా శ్రీమహర్షి వారికన్న వింతయగు మహనీయులతో నాకు సమావేశము కాలే దని తోఁచినది.

నావిషయమున నమ్మహామానీంద్రుఁ డేమియో యాచ రించునట్లు తోఁచును గాని, వా రేమి చేయుచున్నారో తెలియదు. అది యనిర్వాచ్యాధ్యాత్మికముగా నుండ నోపు. ఆచిత్రాతిచిత్రమయిన స్వప్నము నా కెన్నియో సార్లు స్ఫురిం చుచుండెను. స్ఫురించునప్పు డెల్ల నామనమం దేదియో గొప్ప యనిర్వచనీయంబయిన యాస యుదయించుచుండును.

ఆపై నక్కడ నున్న రోజులలో శ్రీవారినిగూర్చి యింకను నెక్కువగా నేమేనియుఁ దెలిసికొనవలయు నని ప్రయత్నించితిని గాని నా కేదియును గోచరింపలే దనియే యనవలయును. అందులకుఁ గారణములు మూడు.

1. వారు ముక్తసరిగా నుండుట వారు కారణవాదముల నంతగా నంగీకరింపరు.

ఒకరు తమయొక్క యభిప్రాయముల నంగీకరించునది లేనిది వారు లెక్కింపరు.

వీనినిబట్టి శ్రీవారికి ఎవ్వరినిగాని తమ యభిప్రాయాను సారులగాఁ గావించుకొన కోర్కె లేదని తెల్లము. ఆవచ్చువా రెట్టివారో ఎంతటివారో యగుదురుగాక వారిని దమ యనుచరులనుగాఁ గావించుకోవలయు నను నాస్థ వారిలో లవలేశమును లేదు.

2 రెండవ కారణము చాల చిత్రమయినది. కాని ఆపరిస్థితి నిక్కముగా కలదు. ఆయద్భుత మయిన స్వప్నము గల్గిన యాసాయంకాలమునుండియును శ్రీవారి సమక్షమునకు వెడలుటలో నా కెంతయును భయసంభ్రములు మునుపటికన్న నెక్కువయయినవి. ఇంకొకరి యెదురుగా నయినచో నా ప్రశ్నల నన్నిటిని చకాపికిగా నడిగి యుందును. కాని అత్యంతమహానీయులయిన శ్రీవారికడ నే నట్టి ప్రశ్న లడుగఁ బూనుచో వారికిని నాకును గల గొప్పయంతరము నామదికి వచ్చుచుండును. కాఁబట్టి ప్రశ్నించుటకు నాకు నోరు రాదు.

3. మూడవ కారణము సర్వసామాన్యముగానే యున్నది ఎల్లప్పుడును శ్రీవా రందుకూటమునం దనేకు లుందురు. అప్పుడు నాయొక్క యాంతరంగికములగు ప్రశ్నలను శ్రీవారిని నడుగుటకు నా కిష్టముగా సుండదు. తీఱ ఆలోచింపఁగా నేనా-వారికి అపరిచితుఁడను - ఆజిల్లాకే సంబంధము లేని వాఁడనుగదా? నాభావములు నాప్రశ్నలు మొదలయినవి గూడ వారియొక్క మనోదృష్టులనుబట్టి వారికి వింతగాఁ దోఁచుట సామాన్యమేకదా? నాకు నచ్చుటి పద్ధతులతో ప్రక్కని వారికి సరిపడునట్లుగా నా ప్రశ్నలను గుదిలించి యడు గుటకును నా కిచ్చలేదు. ఈకారణముచేతను ప్రశ్నించుటకు నాకు నోరు కొంతవఱ కెపఁగదు.

ఈమూఁడు కారణములను దప్పించుకొని శ్రీవారిని ప్రశ్నించుటకు అవకాశము దొఱకుట యరుదు. నేనక్కడ నుండవలసిన వార మింతటిలోనే ముగిసిపోయినది. కనుక నింకొక వార మక్కడనే యుండఁ దలంచుకొంటిని. సార్థక నామధేయులయిన శ్రీమహర్షులవారితో నేను మొదటను బెట్టుకొన్న సంవాదమే కడపటిదిగా నాకుఁ దోఁచుచున్నది. ఏవో రెండు మూఁడు మిక్కిలి సులభముగాఁదేలు ప్రశ్నలు తప్ప ఈమహావ్యక్తికి శ్రమ నిచ్చు ప్రశ్నల నేవియు నడుగు టకు నాకు వశము గాకున్నది.

ఆరీతిగా శ్రీవారియొక్క యత్యంతమనోహరంబయిన ప్రశాంతత్వంబును వారి సమక్షంబున ననుభావమునకు వచ్చు

ననిర్వాచ్యంబయిన సంతసంబును గల్గినదై మఱియొక వార మును గడచి పోయినది. నే నక్కడినుండి బయలుదేఱి వలసిన రోజాసన్న మయినది.

శ్రీవారి సాన్నిధ్యమునం దుండినదానివలన నా కేమి యేర్పడునా యనువిషయమున నా మదియందుఁ జాలుకయిన నాలోచనయున్నది. ఈకూటమునఁ జేరు వారి భాషలును భావములును వేఱయినవి. కాని శ్రీవారిని జూడఁగా వారు అందఱికిని నెచ్చయిన యున్నతమయిన స్థానమున నున్నారు. నే నింతవఱకుఁ గలసికొన్న వారికిని వీరికిని వార యున్నది. ఎట్టకేలకు నా కొక నిర్ణయ మేర్పడుచున్నది. వారు జనసామాన్యమునకుఁ జేరిన వారు కారు. ప్రకృతికి సంబంధించిన వారు. ఆయాశ్రమమునకు వెనుక నున్న మహోన్నతంబయిన పర్వతరాజంబునకు సంబంధించిన వారు వీరు. మఱియును ఆకొండ కానుకొని యున్న యరణ్యమునకును అన్నిటిపయి నావరించికొనియున్న యాకసంబునకును వీరితో ననినాభావసంబంధమున్నది.

ఆ శ్రీమదరుణాచలునియందుండు నొకానొక శిలామయ స్థాణుత్వమే వీరియందును బ్రవేశించియున్నట్లు తోఁచుచున్నది. నిజమే. శ్రీవారికొండమీఁదనే ఇరువది సంవత్సరములు వసించియున్నారు. ఆకొండను వీడి యేకొంతదూరమునకయినను వారు రారు. ఆగిరీంద్రమునకును వీరికిని అంతటి సంబంధమే యున్నచో తద్గుణంబు వీరియందుఁ గన్పట్టక

పోవునా? శ్రీవారు ఈగిరిరాజమునుగూర్చి వ్రాసిన ప్రేమ భావసమన్వితమయిన పద్యములయొక్క భాషాంతరీకరణమును జూడఁగా వీ రీకొండ నెంతయుఁ బ్రేమించుచున్నా రని తెల్లమయ్యెడిని. ఈగిరీంద్ర మేరీతిగా నొక యరణ్యముప్రక్క నుండి యాకసం బంట నున్నతశీర్షంబయి యున్నదో శ్రీవారును జనసామాన్యాటవిం బొడమియు నున్నతభావులై యున్నారు. వారి వైభవమును నిస్సమానత్వమును నిందుఁగాన నయ్యెడిని. శ్రీమదరుణాచలదీపశిఖా శిఖర మేరీతిగాఁ బ్రక్కలను నేలమట్టంబుగా నుండు నితరపర్వతంబులకన్న నున్నతముగా నింగికి నిక్కి యున్నదో ఆరీతిగానే శ్రీవారును తమ చెంత నేండ్లుగాఁ దమను పరివేష్టించి యుండు భక్త బృందములోను మిక్కిలి యున్నతులుగా నున్నారు. ఏయుపమానుపమయిన యభేద్యమయిన ప్రకృతిత్వం బీయొక్కయద్భుతంబయిన పర్వతరాజంబును జేరియున్నదో అయ్యదియే యేరీతిగానో వీరిలోఁ బ్రవేశించియున్నది. వీరియొక్క పద్ధతిగలవారినుండి వీరిని స్థిరముగా విడఁదీసిన దీపర్వతరాజమే కానగును.

వీ రింకను జనులతో ఆలాచాలముగా నుండి ప్రశ్నోత్తరముల విషయమున నెక్కువ కలుపుగోలుతనముగా నుండిన బాగుగా నుండునని యప్పుడప్పుడు నాకుఁ దోఁచుచుండును. అయినను వారు క్రమక్రమముగా జనసామాన్యముతో కలుపుగోలుతనమును నెచ్చింపుచునే యున్నారు.

కాని నిజమునకయినను ఈరీతిగా వారు మానవులకు సాయముం జేయంబూని యున్నా రననగును. వా రాయే కాగ్రదృష్టి వహించినప్పుడు నేను జూడంగా అది మానవ సామాన్యము గాదనియును దానంజేసి యొక్క యున్నత మయిన బోధ మేర్పడగల దనియును నా కవబోధమగు చుండును.

ఇంతవఱకు నాకుం బ్రసాదింపంబడినవి ఈయేకాగ్రదృగ్ద ర్శనమును ఆయద్భుతమయిన స్వప్నమును నై యున్నవి. కాలగమనమునుగూర్చి నాకు గొప్పయోచన గల్గుచున్నది. సుమారు రెండువారములు గడచినవి. జరగినది యొకసంభా షణముమాత్రమే. అది తప్ప మఱి యేదియును జరగని యట్లే. ఆమహర్షిగారి సంభాషణలోని మాహాత్త్వమువల్లం గూడ నేను వారితో సంభాషింప నడ్డు గల్గుచున్నది. నాకు ముఖ్యావసరమయిన విషయ మని నాకుం దోంచునది మహ ర్షిగారు నాతో స్వేచ్ఛగా మాటలాడుటయే. ఎందుకందురా? నామనస్సునందు నొకానొక భావము చేరుకొన్నది.ఆభావము సమాలోచనముపయిన వచ్చినది. తనంతం దానే వచ్చి నెల కొని యున్నది. "శ్రీమహర్షులవారికిం జింతయుం జీకటియు లేదు. వారికే సిలుగును రాదు" అని నాకుం దోంచినది

నేను కొన్ని ప్రశ్నలడిగి యందులకు శ్రీవారి ప్రత్యు త్తరములను విన నిర్ణయించుకొంటిని. అప్పు డా ప్రక్కంగల కుటీరములో నేదో పని చేసికొనుచున్న శ్రీవారి శిష్యు

లలో నొకరికడకు నేను వెడలితిని. వారు నాయం దత్యంతా దరము జూపఁగా నేను నా ప్రయాణమునకు ముందు శ్రీవారి తో నా యప్పటి తుదిసంభాషణము గావింపఁ గోర్కెగల దని వారికిఁ దెల్పితిని. నాయంతట నేనే వెళ్లి శ్రీవారితో సంభాషణము ప్రారంభించుటకు నా కొకవిధమయిన లజ్జగా నుండిన దనియును నతనితోఁ దెల్పఁగా నతఁడు సాదరమయిన చిఱునవ్వు నవ్వి యటనుండి వెలికిఁ బోయి వచ్చి నాసంభాషణమునకుఁగాను మహర్షి గారు సంతోషముతో ముదల నొసంగినా రని తెల్పెను. వెంటనే నేను కూటములోనికి వెడలినంత శ్రీవారుసంభాషణప్రసన్నముఖులై నావంకఁ జూచుచుండఁగా వారి మంచము సమీపమున నే నాసీనుండనై యీరీతిగాఁ బ్రశ్నించితిని.

"తత్త్వమార్గాన్వేషణార్థ మీసంసారమును విడనాఁడి యరణ్యాదులకు వెడల వలయు నని యోగీశ్వరులువచింతురు. మాపాశ్చాత్యదేశములలో నట్టి కార్యములు సాధ్యములగుట మిక్కిలి కష్టము. ఎందుల కందురా? మాజీవితములకును ఏతద్దేశపు జీవితములకును భేదము గలదు. ఆయోగీశ్వరులను పద్ధతి మీకు నచ్చినదా?

అప్పుడు శ్రీమహర్షులవా రొక బ్రాహ్మణశిష్యుని వంకఁ గాంచిరి. అతఁడు శ్రీవారి భాషణము నిట్లు భాషాంతరీకరించెను.

"సామాన్యజీవితపద్ధతిని మానవలసిన పని యుండదు. ప్రతిదిన మొకటి రెండు గంటల ధ్యానము గావింపుచు మామూలుపనులు చేసికొన వచ్చును. ఈరీతిగా సాగించినచో ఇతరకార్యసందర్భములయందుఁగూడ మనస్సు ఆధ్యానవిషయమునఁ బనిచేయుట కభ్యాసము నొందును. లేదా ఈధ్యానపద్ధతికార్యములలోఁగూడఁ గానరా వచ్చు ననియును చెప్పవచ్చును."

"అట్లుగావించిన దాన ఫలిత మేమి?"

క్రమేణ మనుజుల పయినను కార్యములపయినను వస్తువులపయినను మనభావము మార్పు నొందును. మన కార్యములు వానియంత నవియే మనధ్యానపద్ధతి ననుసరించును.

"అట్లయినచో యోగీశ్వరుల వాక్కునకు మీపల్కు భిన్నమగుచున్న"దని నే నాక్షేపింపఁ బ్రయత్నింప మహర్షులవారే యిట్లు వచియించిరి.

"ఈలోకమునకును దనకును సంబంధము గల్గించునట్టి యహంకారమును మనుజుఁడు వదలవలయును. లేని "నేను"ను వదలుటయే నిజము నెఱుంగుట."

"ఈలోకమునందు జీవితమును సాగింపుచునే యహము వదలుట యెట్లు?"

"కార్యమునకును జ్ఞానమునకును పరస్పరబంధము లేదు"

"ఒకఁడు తాను మొదటినుండి గావించుచుండిన తన వృత్తికార్యముల నన్నిటిని గావింపుచు ఆసమయమున నే జ్ఞాన వికాసము నొందఁగలడా?"

"ఆక్షేపణ మేమి? కాని ఆసమయమున నతఁడు తనను భ్రాంతవానినిగాఁ దలంపఁడు. వానిమనస్సు క్రమేణ మార్పు నొంది తుట్టతుదిని ఈక్షుద్రమయిన యహమును దాఁటి పర తత్త్వమునందు లగ్నమగును."

"ఒకఁడు కార్యనిమగ్నుఁ డయియున్నచో వానికి ధ్యానార్థ మవకాశ ముండునా?"

"ధ్యానమునకుఁ గొంత కాలము నియోగించుట యనఁగా మనస్సునకు నెక్కువ యవకాశ మొసంగుటయే. ఈయాత్మ సౌఖ్యానందమునొందసాఁగిన మనుజుఁడు తద్రీతిలో నభివృద్ధి నొందుచునే యుండును. వాఁ డెక్కడ నెక్కార్య మును గావించుచుండినను అతని హృదయాంతరాళమునందు ఆయానందానుభవము నిశ్చలముగా కొనసాఁగుచునే యుండును."

"అట్లయినచో మీరు చెప్పునది యోగపద్ధతి గాదు."

"యోగపద్ధతిలో నొకని మనస్సు దానియొక్క గమ్య స్థానమున కొక గొల్లవాఁడు ఒక బడితెను గొని యెద్దును గదా తోలినట్లు తోలఁబడును. కాని యిందు ఒక తృణముష్టి చూపి యెద్దు నాకర్షించిన విధాన మనస్సును గమ్యస్థానము నకు నాకర్షింతురు."

"అ దెట్లు చేయ నగును?"

"ఈవిషయమున నిన్ను నీవే ప్రశ్న యడుగుకొనవల యును:—

"నే నెవఁడను" అనునది ప్రశ్న. ఈపరిశీలనను కొన ఁగించినచో క్రమముగా నీకు మనస్సునకు వెనుకను దాఁగొని యున్న వస్తువు గోచరించును. ఈగొప్పపనిని నీవు గావించి చో మిగిలిన యెల్ల చిక్కులును విడిపోఁగలవు."

అంతట నే నీ ప్రత్యుత్తరము నవగాహనము చేసి కొనఁ బ్రయత్నించితిని. అక్కడ నుండినచౌకమయిన కిటికీలో నుండి శ్రీమదరుణాచలముయొక్క క్రిందిభాగము నాకు మనో హరముగాఁ గనవచ్చుచున్నది. అయ్యది ప్రాతఃకాలసూర్య రశ్మిరాగరంజితంబై మనోహరముగా నున్నది. అప్పుడు మహర్షులవారు నాతో మరలసంభాషణమును బ్రారంభించిరి.

"ఇట్లు చెప్పినచో సుకరగ్రాహ్యము గావచ్చును. సమస్తజనులును సంతోషమును గోరువారే. వారు కోరునది యనంతసంతోషమును. ఇది నిశ్చయము. వారు తమ్ము దామే యన్నిటికన్న నెక్కువగాఁ బ్రేమించుకొనుటను నీవు గమ నించినావా?"

"సరే."

"ఆవిషయముతో వారు నిరంతరము నుపాసనమూల ముననో మతమూలముననో మఱిదేనినో సంతోషము నన్వే

షింపుచుందు రను విషయమును ముడిపెట్టుము. అప్పుడు మను జునియొక్క నిజమయిన తత్త్వమును దెలియుటకు నీకుఁ ద్రోవ లభింపఁగలదు."

"నే నిది యోచింపఁజాలను."

అని నే ననునంతలో వారు ఇంకను ఉచ్చైస్స్వ నంబుతో నిట్లనిరి.

"మనుష్యునియొక్క నిక్కమయిన తత్త్వము సంతో షము. అంతరాత్మ దానికి జన్మస్థానము. అతఁడు సంతోషము సంతోష మని ప్రాఁకులాడుట తనను దా నెఱుంగుటకే. ఆని జమయిన తా నవినశ్వరుఁడు. కాఁబట్టి మానవుం డెప్పుడు నిజముగాఁ దన్నుఁ దా నెఱుఁగునో అప్పుడే యొక యనంతం బయిన సంతోషము నందఁగలఁడు."

"కాని-యీలోక మింత యసంతుష్టముగా నున్న దే"

"అవును. కాని ఆలోకమునకు తన్నుంగూర్చి తనకుఁ దెలియదు. ఒక్కరుగూడ తప్పక యెల్ల జనులును తెలిసికాని తెలియకకాని ఆసంతోషమునే యన్వేషణము గావించు చున్నారు."

"దుర్మార్గులును పశుప్రాయులును నేరగాండ్రును సయి తము చేయు కార్య మిదియేనా?" యని నే నాపైఁ బ్రశ్నిం చితిని."

"వారు పాపము చేయునదిగూడ తదాత్మసంతోష సంపాదనముకొఱకే. వారు చేయు ప్రతిపాపములోను దానిని గాంచఁ గలమని వారి తలంపు. ఈరీతిగాఁ బోరాడుట మనుష్యునిలోని స్వభావము కాని తా మీా ప్రయత్నములనన్నింటిని గావించుట తమ్ము దా మెఱెంగికొనుటకే యని వారికిఁ దెలియదు. కాఁబట్టి వారు తమయొక్క సంతోషమునకై యీ దుర్మార్గంబుల నేఁగుదురు. నిజముగా అవి తప్పుడు త్రోవలే. ఆసంగతి నామనుజు లవలఁ గనుంగొనఁగలరు."

"కాఁబట్టి మనలను మన మెఱెంగినప్పు డానిరంతర సంతోషమును జెందఁగలమా?"

ఈప్రశ్నకు శ్రీవా రవు ననుభావము వచ్చునట్లు శిరః కంపనము గావించిరి.

ఇంతలో కిటికీయద్దములోనుండి యెండ శ్రీవారి మోమున వ్యాపించినది. ఆకనుబొమ్మలలో నైశ్చల్యమును ఆవదనమునందు సంతృప్తియును ఆప్రకాశమానములయిన కనులయందు ప్రశాంతత్వమును నాకు గోచరించినవి. వా రెట్టి మాటలు మాటాడుదురో యందుకుఁ బ్రవర్తనము భిన్నముగా నుండ దని వారిముఖలక్షణములు దెల్పెడిని.

శ్రీవారు వచియించిన వాక్యము లను భాషాంతరీకర్త నా కింగ్లీషులో వచియించినాఁడు. కాని దానియందలి యర్థ విశేషము నాతఁడు నాకుఁ దెల్పఁగల్గెనా? ఆప్రయత్నము నేనే

చేసి తద్వాక్యముల భావము నెఱుంగవలయును. మహర్షి గారి మాటలలో వేదాంతితత్వము లేదు. తన పల్కులనే సిద్ధాంతము గావించు పండితునితనమును లేదు. ఏది మాటాడినను హృత్కుహరాంతమునుండి మాటాడును. ఈవాక్యము లాశ్రీవారి మహానుభవమునుండి యేర్పడిన యభిప్రాయములే. అని తలంచి నే నిట్లు పల్కితిని.

"మీరు" తాను, తాను "అని పల్కుచున్నారు. ఆ "తా" ననునది యేదో స్పష్టము కాలేదు. మీరు చెప్పునదే నిజమయినచో మనుష్యునిలో నింకొక "తాను" ఉండవలయునుగదా?"

వా రించుక చిఱునవ్వి యీరీతిగాఁ బ్రత్యుత్తర మొసంగిరి.

"మనుష్యునిలో రెండు వ్యక్తు లుండునట్లు భావింపవీ లగునా? ఈ సంగతి నెఱుఁగఁ దలంచినవాఁడు మొట్టమొదటను తనను తాను విభజించి పరిశీలించుకొనవలయును. ఇతరు లాలోచించిన ట్లాలోచించుటయే సామాన్యజనుని యొక్క యలవాటు. కాఁబట్టి యతఁ డెప్పుడును "నేను" అను దానిని కలరూపున నెఱుంగలేఁడు. తా నెవ్వరో తనకు సరిగాఁ దెలియదు. తన శరీరమును తనయొక్క బుద్ధియే తానను భ్రాంతి యతనితో చాలకాలముగా వచ్చుచున్నది. కాఁబట్టి నేను నీకు వచియించునదే మనఁగా నీవు "'నే' ననఁగా నెవఁ?" డను పరిశీలననే కొనసాఁగింపుము.

ఈసంగతులు నా కవగాహన యగుటకుఁ గాఁబోలు శ్రీవారు కొంత నిదానించి వెండియు ని ట్లనిరి.

"ఆత్మయొక్క కలరూపును వివరింపు మందువు. ఏమి వివరింప నగును! దానినుండియే తననుగూర్చిన యహంకారము జన్మించునది. ఆయహంకారము అందులోనే యంతరించును."

"అంతరించునా? తనతనము నొకఁ డెట్లునీఁడఁగలఁడు?"

"ఒక మనుష్యునికిఁ గల్గునట్టి భావములలోఁ బ్రప్రథమ మయినది "నేను" అను భావము. ఈభావము పుట్టినపిమ్మటనే యేయితరాభిప్రాయములయినను జన్మించును. మనస్సునందు సర్వనామములలో మొదటిదయిన "నేను" ఉదయించినతరు వాతనే "నీవు" అను రెండవ సర్వనామము జన్మింపఁగలదు. ఆ "నేను" అను దారమునుబట్టుకొని అది బయలుదేఱు స్థాన మువఱకు మనము వెంబడించినచో-ఏరీతిగా అది భావము లన్నిటిలో మొదటిదిగా నుద్భవించినదో ఆరీతిగానే అది భావములన్నిటి కడపట నంతరించు నని మనకుఁ దెలియఁగలదు. ఇది యంతయు ననుభవమువల్ల నే తెలియఁదగినది.

"ఒకఁడు తనలో నిట్టి పరిశీలన గావించుకొనుటకు తప్పకుండ వీ లగునని మీయభిప్రాయమా?"

"నిక్కముగా. ఆ "నేను" అను భావము అంతరించు వఱకును బరిశీలింప వీ లగును."

"అ ట్లయినప్పుడు నరుఁడు మూర్ఛావస్థ నందునా? లేక మతి లేని వాఁ డగునా?" అని నేను బ్రశ్నించితిని."

"అట్లు కాదు. మనుష్యుని జడత్వమయిన తనను దా నెఱింగినప్పుడు మీఁదుమిక్కిలి వానికి అఖండమయిన మెలఁకువ కల్గును. వానికి నిక్కమయిన తెల్వి కల్గును."

"కాని ఆ "నేను" అను భావముగూడ ఆనరతత్త్వ మునకు సంబంధించినదే కదా?

"ఆ "నేను" అనుభావము ఆమనుష్యుని శరీరమునకు వాని మెదడునకు సంబంధించినది. ఒకానొకఁడు తనయొక్క కలరూపు నెఱింగినప్పుడు మ ఱేదో వస్తువు వాని తత్త్వము లోని యగాధభాగ మగునెటనుండియో లేఁచి వాని నాక్ర మించును. అదియే మనస్సునకు వెనుక నున్నది. అది యనం తము. అఖండము. దైవమయము. దానినే కొందఱు స్వారాజ్య మందురు. కొంద ఱాత్మ యందురు. మఱి కొందఱు నిర్వాణ మందురు. హిందువులు మోక్ష మందురు. దానికే పేరయినను బెట్టవచ్చును. దానిని జెందిన వాఁడు తనను దాను బోఁగొట్టు కొన్న వాఁ డెన్నఁటికిఁ గాఁడు. మీఁదుమిక్కిలి తనుఁ దాఁ గన్న వాఁ డగును."

శ్రీవారి యీ కడపటి మాటలు వారి నోటినుండి వెల్వడినంత నాహృదయమునందు 'గలీలీ' అను నొక సంచా రకప్రవక్త వచించిన "ప్రాణమును గాపాడుకొన్న వాఁడే దానిని బోఁగొట్టుకొనువాఁడు. దానిని బోఁగొట్టుకొనువాఁడే దానిని గాపాడుకొను వాఁడు" అనువాక్యము తళుక్కు మని

మెఱుపు మెఱసినచందానఁ దోఁచినది. శ్రీవారి వాక్యమును నిదియు నెంత వింతఁగాఁ బోలుచున్నవి! క్రైస్తవమతమునకు సంబంధింపని త్రోవలో ఈహైందవమహర్షులకుఁగూడ ఒకానొక కఠినమయిన అసామాన్యమయిన పంథాప్రకార మీయభిప్రాయ మేర్పడినది. ఇంతలో శ్రీవారు మరల వచియించుచున్నారు.

"తనయొక్క నిజతత్త్వము నెఱుఁగుటకుఁ బూనువఱకును దాని నెఱుంగువఱకును అనుమానమును అనిశ్చలతత్త్వమును వాని జీవితమునందు వానిని వెంట నంటియే యుండును. గొప్పగొప్ప రాజులును రాజకీయవేత్తలును ఇతరులను బాలించుటకుఁ బ్రయత్నింతురు. కాని వారి యంతరాంతరములయందు తమను దా మేలుకొను శక్తి లేదని వారికిఁ దెలియును. అయినప్పటికిని పరిపూర్ణాంతరమువఱకును మానసమును భేదించిన మానవునికి అత్యంతగరిష్ఠమయిన శక్తి స్వాధీనములోనే యున్నది. గొప్ప తెల్వి గల వారెందఱో యాయాయనేకవిషయములను గూర్చిన తెల్విని సంపాదించుటకుఁ దమ జీవితములను వమ్ము చేయుచుందురు. కాని మానవునియొక్క వైచిత్ర్యమును వారు కనిపెట్టఁగల్గిన సంగతినిగూర్చియును-తమ్ము తాము జయించినారా యనియును-వారలనడిగినచో వారు సలజ్జముగాఁ దలలు వంచుకోవలసివచ్చును. తనను దా నెఱుంగనప్పు డెన్నియో యితరములగు వానినిగూర్చి యేమి తెలిసికొని యేమి ప్రయోజనము? తమను తాము తెలిసి

కొను ప్రయత్నము చేయుటకన్న నరుల కింక నత్యాంతరంబయిన కర్తవ్యం బేదో?

"ఆకార్యం బతిమానుషమును అతికష్టమును అగును గదా" యని నా విమర్శన.

దానికి భగవానులవారేమాత్రము నొప్పుదలను సూచింపనట్లు అభినయించి యిట్లనిరి:—

"అది చేత నగునో కాదో యనుభవమునఁ జెప్పఁదగినది. ఆ శ్రమ మన మనుకొనునంతకంటె నిక్కముగా తక్కువగా నుండును."

"కాని, కేవలభౌతిక ప్రపంచజీవికనుగడపు మాబోఁటి పాశ్చాత్యులకు నిట్టి ప్రయత్నములు సాధ్యములు..." అని నాయాక్షేపణము నర్ధములో వదలినాను.

భగవానుల వారు మఱియొక యూఁదువత్తిని వెల్గించి యిట్లు వచియించిరి:—

"హిందువులకయినను నైరోపీయులకయినను తత్త్వము నెఱుంగు పద్ధతి యొక్కటియే. నిజముగా ప్రాపంచికవిషయములలో నెక్కువ నిర్మగ్నులయిన వారి కయ్యది కష్టతరముగా నుండఁగలదు. అయినప్పటికిని ఈకార్యము చేయ వీలగుటయేకాక చేసి తీఱవలసినదై యున్నది. ధ్యానమునం దేర్పడు ఈమార్గాన్వేషణ ప్రయత్నప్రవాహము ఎన్ని పనులలో నున్నను మనంబునందుఁ బ్రవహించుచుండునట్లుగా

అభ్యాసమూలమునం గావింపవచ్చును. ఆపయిన ఆనరులు తమ తమ కార్యముల నాప్రవాహమునం దుండియే కావించుకొన వచ్చును. ఈరీతిగా ఆప్రవాహ మవిచ్ఛిన్నముగా నుండును. ఈరీతిగా ధ్యానమునకును శరీరముతోఁ జేయు కార్యముల కును భిన్నత యుండదు. "నే నెవరు" అను ప్రశ్నను గూర్చిన యాలోచనను నీ వారంభించి, నీదేహముగాని నీబుద్ధిగాని నీకోర్కులుగాని ఆ "నేను" కా దని నీవు కనుగొనఁగల్గి నప్పుడు నీయొక్క యంతరాంతరంబునం దుండిన తత్త్వంబు తనంత తానే వెల్వడి నీ కవగతం బగును. ఆరీతిగా తత్త్వజ్ఞాన లాభము తనంతఁ దానే లభింపఁగలదు."

ఈసంగతుల నర్థము గావించుకొనుటకు నేను కొంత యోచనలో మునిఁగితిని. శ్రీవా రింకను జెప్ప సాఁగిరి:—

నిన్ను నీ వెఱుంగఁ బ్రయత్నించినచో తత్త్వము నీహృదయమునందు సూర్యకాంతితోఁ బ్రకాశించును. అప్పుడు హృదయము నిశ్చల మగును. నిక్కమయిన సంతస మందు నిండుకొనును. ఎందు కందురా? ఎక్కడ ఆత్మ యుండు నో అక్కడనే యానందముండును. ఈయాత్మజ్ఞానంబు నొందిన తరువాత నేసందేహమును నుండదు."

అని వచియించి భగవానులవా రాకూటమునందు దూరముగాఁ దమ చూపును నిగిడించిరి. ఇంతటితో వారియా సంభాషణ మంతమయిన దని నేను గ్రహించితిని. ఈరీతిగా వారితోఁ దగవయిన సంభాషణమును మత్ప్రియాణాత్మా

ర్వము నేను గావింపఁ గల్గినందుల కెంతయును సంతసము నందితిని.

నేను వారి నక్కడ వదలి యట నున్న చిట్టడవిలోని యొక నిర్జనస్థలమును జేరితిని. అక్కడనే నేను, పగటిలోఁ జాల భాగ ముందును. అప్పుడు నేను చదువుకొనుటయు వ్రాసికొనుటయు జరగును. మసక చీఁకటి యగుసరికి నేను మరల భగవానులవారి కూటమునకుఁ జేరుకొంటిని.

భగవానులవారాకూటమునందు మామూలు ప్రకారము వేంచేసియున్నారు. పంకా లాఁగఁబడుచున్నది. వారు తమ మంచముపయినఁ బద్మాసనము వైచుకొని మోచేతిపయి నూనుకొని కూర్చున్నారు. ఇట్టి యాసనము నే చెన్నపురమునందలి యోగియయిన బ్రమగారికడఁ గాంచియున్నాను. వారుదీనిని సుఖాసన మనియుండిరి. అది కొంతవఱకు బుద్ధుని పద్ధతిని బోలును. వారు నావంక నదేపనిగాఁ జూచుచు మిన్నకుండిరి. వారిసోఫా దిగువను వారి దండకమండలువు లుండినవి. అవియును గోపీనమునుమాత్రమే వారి కిహమునందలి యాస్తి. వారి లోచనములు నిరంతర ప్రకాశమానములు. అంతలో వారాచూపు నేకాగ్రము గావించిరి. శరీరము స్థైర్యము వహించినది. వణఁకుచుండిన శిరము స్థాణు వయినది. నేను వచ్చినప్పుడు తొల్తఁ గాంచిన శ్రీవారిసమాధిదశవంటి దిది యని నాకర్థ మయినది. ఇంతలో నౌకరు నాకడకు వచ్చి "భగవానులవారు ధ్యానమగ్ను లయినారు. ఇఁకను వారితో

మాటాడ వీల్పడదు" అని యాంతరంగికముగా వచి యించిరి. అక్కడ నున్న వా రెల్లరను అంతకంతకు నైశ్శ బ్ద్యము నవలంబించుచుండిరి. నే నా రీతిగా నుండ వలయు నను నాచారనియమములు గల వాఁడును గాను. కాని, శ్రీవారి మహాశక్తి నన్ను బలీయముగా లోఁగొన్నది. అట్టి శక్తి యాకూటమునం దంతటను నిండుకొన్నట్లు నాకు మనో గోచర మయినది. ఈశక్తివ్యాపనమున కంతయును శ్రీవారే కారణ మని నాకుఁ దెల్లమయినది.

అప్పుడు వారి కనులను జూడఁగా నత్యంత ప్రకాశము గాను అద్భుతముగాను వెలుఁగుచున్న వి. అప్పుడు నాలో వింతవింత భావము లుప్పతిల్లినవి. వారి వీక్షణము లత్యద్భుత ప్రక్రియతో నాహృత్కుహరాంతరాంతములను బ్రవేశించి యందు నిగూఢముగా నున్న వస్తువులనన్నింటిని గాంచుచు న్నట్లు నాకుఁ దోఁచినది. నాభావోద్రేకాభివాంఛల నన్నిటి నా శ్రీవారు తద్వీక్షణములమూలమునఁ గనుంగొనినట్లుగా నాకుఁ దోఁచినది. ఆశక్తిముందఱ నే నేమి చేయఁగలను? నాయొక్క పూర్వచరిత్రములో నేను మఱచిన మఱువని భాగ ముల నన్నింటి నతఁ డెఱింగె నని నాకు నిక్కముగాఁ దోఁచి నవి. ఆశ్రీవారి దృక్కునుండి? నేను తప్పించుకోజాలను. ఆ యిష్టమును నాకు లేదు. ఎందుకనఁగా శ్రీవారినుండి యుత్త రోత్తరలాభ ముండు నను నాస నన్నట్లు వారికి లోఁబడఁ జేసెడిని. ఈరీతిగా వారు నాయొక్క చారిత్రమునందలి

సంగతు లన్నియును చెలిసికొన్న ట్లయినది. ఆమూలముగా నామనస్సునకు నిశ్చలత్వము గల్గించుచున్నట్లును దోఁచినది. అంతియే కాక యేవిధమయిన మానసికపరివర్తనముచేత నేను సామాన్యజనపద్ధతిని విడనాడి తనవంటి వారి నన్వేషించుటకు సంచరించునదియు నారయునట్లు తోఁచినది. ఇంతలో వారియొక్కయును నాయొక్కయును మధ్యను ఆకర్షణవాహిని ప్రవహించిన ట్లయినది. నాచూపు లేమో భ్రమించుచున్నవి. వారి దేమో యేకాగ్రదృష్టి. అంతియ కాక ఏప్రశాంతియందు వారియొక్క మనం బానందంబునఁ బొందుచున్నదో దానితో నాయొక్క మనంబునకు ఆశ్రీవాదసంబంధము గల్గించి నాకు ఔన్నత్యానందంబులఁ బ్రసాదింపఁబూనినట్లు నాకుఁ దోఁచినది. ఆయత్యంతమయిన ప్రశాంతియందు నా కేదో మిక్కిలి తేలికతనము గల్గినట్లు తోఁచినది. కాలము మిక్కిలి నిదానముగా జరుగుచున్నట్లు కన్పట్టినది. నన్నుగూర్చిన యేదో పెద్ద బరువు నానుండి వదలిపోయినట్లు నాకుఁ దోఁచినది. ఇఁక ముందెప్పుడును గోపము అసంతృప్తిజనితదుఃఖతత్త్వము అనునవి నాహృదయమును బాధింప వని నాలో నాకుఁ దోఁచినది. ఈజాతికే యీప్రశాంతిగుణమున్నది. దీనివలననే వీరు మంచినిగూర్చి యాస వహించియుందురు కష్టకాలంబున ధైర్యము వహించియుందురు. ఈసంతృప్తిప్రశాంతభావమే యెల్ల సాద్గుణ్యసార మని నాకుఁ దీర్మాన మేర్పడుచున్నది. ఈ నిశ్చలధ్యానసమయమున ఆకూ

టమునందుఁ జీమ చిటుక్కుమన్నను వినఁబడు నట్లున్నది. నేను శ్రీవారియందు మనసు నిల్పితిని. వారినుండి జ్ఞానము ప్రవహించునట్లు తోఁచెడిని.

అనేకపర్యాయము లీశిష్యు లెల్ల నిమ్మహర్షివర్యుని నేండ్లుఁబూండ్లుగాఁ బరివేష్టించియుండుట యెందులకని నాలో నాకే యనుమాన మేర్పడినది. ఎందు కందురా? వీరి సంభాషణములు స్వల్పసంఖ్యములే. సౌఖ్యములా? సున్న యనవచ్చు. ఇతరాకర్షణములా? లేవు కాని వీరిక్కడ నేండ్లుఁబూండ్లుగాఁ గడపుచున్న సమయమునం దంతయును వీరికి శ్రీవారినుండి జ్ఞానప్రసారలాభ మత్యంతాదృశ్యరీతిగా జరగుచున్న దని నా కిప్పుడు బోధపడినది.

ఇంతవఱ కాకూటమునం దంద ఱున్నను నత్యంత నిశ్శబ్దముగా నుండినది. అప్పు డక్కడినుండి యొక్కొకరుగా నందఱును వెడలిరి. శ్రీవారును నేనుమాత్రమే మిగిలినాము. ఇట్టిసంఘటనము నే నున్నయిన్నాళ్లుగా నెప్పుడును జరగియుండలేదు. శ్రీవా రప్పుడు నావైపున కేకాగ్రముగాఁ గాంచసాఁగిరి. ఆకన్నులయం దింతకుముందుఁ గన్పట్టిన తేజోరీతి యిప్పు డత్యద్భుతముగా నెచ్చినది. నాకొకవిధమయిన మైమఱపు వచ్చినది. నే నంతలో నతిప్రయత్నమున గడియారము గాంచి శ్రీవారికి నమస్కరించి బయటికి వచ్చి, మఱియొకసారి యాశ్రమమునకు నమస్కరించి యెద్దుబండి నెక్కి బయలుదేఱితిని.

## అరణ్యాశ్రమము.

నా జీవితచరిత్రమునందు మఱువరాని యమూల్యమయిన సమయములు గలవు. ఇప్పుడు నేను శ్రీమహర్షులవారి కూటమును బ్రవేశించుచుంటయు నట్టి వానిలో నొకటి. మామూలుప్రకారముగా శ్రీవారు తమ సోఫాపయిన అందమయిన వ్యాఘ్రాజినమునఁ గూర్చుండియుండిరి. చెంత నూఁదువత్తులు పొగ రాజుచున్నది. నే నటఁ బ్రవేశించినంత వారు నా రాకను సాదరమయిన చిఱునవ్వుతో నంగీకరించిరి. ఆకూటమున శ్రీవారినుండి తగుపాటి దూరమునఁ గొలఁది మంది శిష్యు లక్కడక్కడఁ గూర్చుండియుండిరి. ఒక శిష్యుఁడు పంకా లాగుచుండెను.

ఇప్పుడు నేను శ్రీవారిని సందర్శించుట వారికడ శిష్యత్వము నపేక్షించి. వారు నా యభిలాష నంగీకరింతు రను నమ్మకము నాకుఁ గలదు. ఎందు కనఁగా వారి సాదరాకర్షణ శక్తియే నన్ను బొంబాయినుండి యింత దవ్వు గైకొని వచ్చినది. నేను తొల్దొల్త కొన్ని సమయోచితమయిన మాటలఁ బల్కి నాకోర్కిని దెల్పి వచియించినాఁడను. అందులకు భగవానులవారు మందహాసముమాత్రము గావించిరి నేను మఱల నాయభిలాష నే నొక్కి వక్కాణించితిని. కొంతసేపటికి శ్రీవారే నా కిటుల జవా బొసంగిరి.

"గురువు లెవ్వరు? శిష్యు లెవరు? శిష్యులకే యి

సందేహములు తట్టుచుండును. ఆత్మజ్ఞానము గల్గిన తరువాత గురుశిష్య భేద ముండదు. ఆత్మజ్ఞులె కంటి కెల్లరు నొక్కటియే.

ఈప్రత్యుత్తరము నా కొక విధముగా నచ్చినను నేను నాయభిలాష నే యనేకవిధములుగాఁ బ్రచ్ఛి యడిగితిని. కాని యందులకు శ్రీవా రొడంబడ లేదు. కాని తుదకు వా రిట్లు సెల విచ్చిరి:—

"నీలోనే నీ గురుఁడు లభించును. అనఁగా నీయాత్మ యందు. ఆయాత్మకును ఈ నీదేహమునకును ఏరీతిగా సంబంధము లేదో ఆరీతిగానే నీ వనఁగా ఈదేహము కా వని యెఱుంగవలయును."

ఈ జవాబునుబట్టి శ్రీవారు నాప్రశ్నకు నేదయిన యుత్తరము నొసంగుట లే దనియును దానిని మాఱు రీతులతో నెట్లో లాగవలసి యుండుననియును నాకుఁ దోఁచినది. బహుశః వా రప్పుడప్పుడు గావించు సూచనల రూపునఁ గాంతు నేమో? నే నక్కడనే మఱి కొన్నిరోజు లుండఁ దలంచితిని.

పిమ్మట నే నక్కడ నుండిన పద్ధతి నా దేహాను కూల్యమునకుఁ జిక్కుగానే యుండినది. పగటి వేళ లేమో శ్రీవారితో కూటమునందుఁ గడచుచుండినవి. రాత్రులయందు కంగాబంగగాఁ గట్టఁబడిన గుడిసెయందుఁ గటికినేలను గంబళి పఱచుకొని నిదుర లేక దొరలవలసి యుండెను. నే

నున్న యీ గుడిసె యాశ్రమమునుండి 100 గజముల దవ్వున నున్నది. గోడలు పలుచని గిలావు కలవై యున్నది. పయికప్పు ఎండలకును వానలకును దాళుకొను బలము గల్గియున్నది. చుట్టుపట్లను జిన్నవియును బెద్దవియును నగు పొద లున్నవి. పడమటినుండి యరణ్యము ప్రారంభ మగుచున్నది. ఆయెచ్చు తగ్గులు గలుగు భూభాగమువల్లను ప్రకృతియొక్క యారణ్యక సౌందర్యవైభవము వెల్లడి యగుచున్నది. నాగదాళి మొద లయిన పొదలు గలవు. ఉత్తరదిశను మహోన్నతమై ధాతు రంజితాపుణారుణప్రభలఁ జెలంగు పర్వతరాజ మెసంగు చున్నది. దక్షిణమున నొక పొడుగాటి కుంట యున్నది. అందలి నీరము నిర్మలము. అయ్యది నా కెంతయు సంతసము నొసంగినది. దాని గట్లఁ జెట్లు గుంపులుగుంపులుగా నున్నవి. అందు గోధుమవన్నెవియును బూదివన్నెవియును నగు కోఁతులు మందమందలుగా నున్నవి.

అక్కడ నేను గడపిన రోజులన్నియు నొకటే విధముగా నున్న వని చెప్ప వలయును. ప్రతిదినమును మామూలుగా బూది ఆకుపచ్చ సువర్ణారుణమును అగు రంగులతోఁ బ్రారంభ మగును. అట్టి యుషఃకాలమున నేను మేల్కాంచి కుంట కరిగి యీఁదులాడుదును. అప్పుడు అక్కడ నందందు నక్కియుండు పాములు పాఱిపోవునట్లుగా నాకాళ్లను గొట్టి ధ్వని చేయు చుందును. పిమ్మట నుడుపులను ధరించి క్షురకర్మ గావించు

కొందును. (ఆగ్రామ్య ప్రదేశమున నిది యొక్కటియే నేననుభ వింపఁగల్గిన నాగరకభోగము.) ఆపయిన నే నక్కడ నేర్పాటు చేసికొన్న రాజు అను పిల్లవాఁడు తేయాకు కషాయము తయారయిన దని నేను అప్పుడప్పుడు నేర్పఁగా వచ్చి రాని యింగ్లీషులోఁ జెప్పును. ఆసేవకుఁడు మిక్కిలి మంచివాఁడు. నా యాహారమునకు కావలసిన వస్తువుల నూరియందు గష్ట ముతో సేకరింపఁ బ్రయత్నించును. నేను శ్రీవారి కూటమునం దుండినప్పుడు శ్రీవారు ధ్యానమగ్నులయియున్నచో వాఁ డాకూటము వెలుపలను అత్యంత నైశ్చల్యముతోఁ గాచు కొనియుండును. మావంటలును మాయాహారముల రుచులును వానికి సరిపడినట్లు లేదు. ఎన్నియో ప్రయత్నములమీఁద నేను ప్రతిదిన మొంటిపూటనే గట్టి యాహారము గైకొనున ట్లేర్పాటు చేసికొంటిని. దినమునకు మూఁడు పూటలును తే నీరు త్రాఁగుట యక్కడ నాకు మిక్కిలి సంతోషప్రదముగాను సౌఖ్యప్రదముగాను నుండినది. ఆనా సేవకుఁడగు పిల్లవాఁడు వాని నల్లని దేహచ్ఛాయనుబట్టి ద్రావిడజాతికిఁ జెందినవాఁ డని నా నమ్మకము.

భోజన మయినతరువాత నే నాశ్రమమునకు వెడలి యం దున్న గులాబిచెట్లకడ నిల్చుండి వాని సౌందర్యము నాలోకించి యానందించి శ్రీవారి కూటమును బ్రవేశించి యక్కడ నున్నవారిలో నెవనితోనయినను సంభాషింతును.

లేదా శ్రీవారితోనే యేదో ప్రశ్న గావింతును. లేదా శ్రీవారు వచియించియుండిన ప్రకారమున ధ్యాననిమగ్నుఁడ నగుదును. శ్రీవారు సామాన్యముగా సాయంకాలముల ధ్యానపద్ధతి నుందురు. ధ్యానములయం దాకూటమునఁ గల యధ్యాత్మికవ్యాప్తి కనుభవమునకు వచ్చుచుండును. శ్రీవారి సన్నిధియందుఁ గూర్చుండుటచేతనే నాకుఁ బ్రశాంతిలాభాను భవము గల్గును. వారి సన్నిధి గల్గినప్పుడంతయును నా మెదడు లోని నాడు లన్నియును నాధ్యాత్మికవిమర్శనము గావించి తత్త్వానుభవలాభ మేర్పడుచుండును. అది యంత తెల్లముగా నుండ దేమో కాని పొరపాటు లేనిదని చెప్ప నగును.

ఇట్లు ప్రాతఃకాలమునుండి పదునొకొండుగంటల వఱకుఁ గడపి నే విడిసిన గుడిసెకు వెడలి భోజనవిశ్రాంతు లను ముగింతును. ఆసమయమున నొక్కొక దినము ధ్యానము, నొకనాఁడు సంభాషణలు, నొకనాఁడు ఆప్రకృతిరమణీయముల యిన స్థలముల సంచారములును, ఒకనాఁడు ఆమిక్కిలి పెద్ద దేవాలయమును సందర్శించుటయును, నొకనాఁడు ఊరిలో నికిఁ బోవుటయు జరగుచుండును.

అప్పుడప్పుడు భగవానులవారును తమ భోజనమయిన తరువాత నే నుండునెడకు వేంచేయుటయుఁ గలదు. అప్పుడు నేను వారి నెన్నియో ప్రశ్నల నడుగుదును. వారు మిక్కిలి ప్రశాంతముగాను చిఱునవ్వుతోను ప్రత్యుత్తరముల నతి నిదానముగా నొసంగుదురు. ఆప్రత్యుత్తరములు మిక్కిలి

క్షిప్తములుగా నుండును. నే నేదో యొక క్రొత్త ప్రశ్న యడిగి నచో వారందులకుఁ బ్రత్యుత్తరమును వెంటనే యొసంగక దూరముగాను ఏకాగ్రముగాను దృష్టి నిగిడించి మిక్కిలి నిశ్చలముగానుందురు. ఆదృష్టియు ఆభావనయు దేనినిగూర్చియో నాకుఁ దెలిసికొన నసాధ్యము. ఆధ్యానముమధ్యను వారిని గలఁగింప నా కనిష్టముగాను అసాధ్యముగాను నుండును. ఎందు కందురా? వారి నిశ్చలశక్తియెదుర నాయది కొఱగాని దగును. వా రట్లు ధ్యాననిమగ్నులై యున్నసమయములో నాలో భావతరంగాలోచన పరంపరలు బయలుదేఱి నాసందేహ ములను జాలవఱకు సడలించును. వా రట్లు సుస్థిరదృక్కుతో సుమా రరగంటసేపు నాకడఁ గూర్చుండి యుందురు. వారికి నాజ్ఞప్తియే లే దనుకొందునుగాని అంతలోఁ దటాలున నామ నస్సులోనే యొక భావ ప్రవాహము ప్రవహించినట్లై నా సందేహమునకు సమాధాన మేర్పడును. దానఁ జేసి శ్రీవారికి నాయందు జ్ఞప్తి యుండు నని తోఁచును. అది యొకయెలెక్ట్రిక్ కరెంటువలెఁ గనుపట్టినది.

ఇంకొక సమయమున శ్రీవారి నిట్లు ప్రశ్నించితిని.

"స్వామీ! ఈత్రోవలో నెన్నియో కష్టము లున్నవి. నా కసాధ్య మని తోఁచెడిని."

"అంతకన్న పొరపాటయిన యభిప్రాయ మే మున్నది. చేతఁగా దను నమ్మకమును భీతియును ఈమార్గమునకు నడ్డములు."

"అట్టివి నిజము కావా?"

"కావు. ఒక నరుఁడు గావించు దోసంగులలోని కెల్ల గొప్పది తాను స్వభావముచేత చేతఁగాని వాఁ డనియును చెడ్డ వాఁ డనియుఁ దలఁచుట. ప్రతిమనుష్యునిలోను దైవ తత్త్వమును బలమును స్వాభావికముగా నుండును. కాని బలహీనతయును చెడ్డతనమును వాని నడతలయం దుండును. అతని కోరికలలోను తలంపులలోను చెడ్డతన ముండును. కాని వానిలో నుండవు.

వారి యీపల్కులు నా కెంతయు మనోబలము నొసంగినవి. దానినుండి యెంతో యుత్సాహము జన్మించినది. ఇట్టి పల్కులే శ్రీవారుగాక మఱి యొక సామాన్యుడు పల్కి యున్నచో వాని నంతగా పాటించి యుండువాడను కాను. కాని యీవిషయములు శ్రీవారు తమ యంతరాంతరము నుండియును మహానుభవమునుండియును బల్కినట్లు తోఁచె డిని. కాని వారు కేవల మొక సాధారణవేదాంతి వచియించిన రీతిని బల్కినట్లు తోఁపదు.

ఒకానొక సమయమున పాశ్చాత్యుల విషయమును గూర్చి మాటాడుచు నే నొకానొకయుద్రేకముతో ని ట్లంటిని.

"తమవంటి వా రీరీతిగా అరణ్యమునం దొక మిక్కిలి నిరాడంబరమయిన యాశ్రమమునందు నుండఁగలరు. ఇందు

మీ కెట్టి తొందఱ గల్గదు కనుక మీయొక్క తత్త్వాన్వేష ణము కొనసాఁగుచున్నది.”

“గమ్యస్థానముఁ జేరినప్పుడు, తెలిసికొనువాఁ డెవరగు నది తెలిసినచో లండన్ నగరములోని భవనమునందుండినను అరణ్యమునందు నిర్జనస్థలమునం దుండినను భేదముండదు.” మఱియొక సమయమునందు నేను ఈ హిందువులు తమయొక్క ప్రాపంచికవిషయములలో నెన్నో లోపములతో నున్నా రని వచియించితిని. అందులకు శ్రీవా రిట్లనిరి.

“మాజాతి వెనుకఁ బడియుండుట నిజమే. కాని మాయభిలాషలు తక్కువ. మాసంఘ మభివృద్ధి చెందవలసి యున్నది. కాని మీవారికన్నను ఇక్కడి వారు తక్కువ సంఖ్య వస్తువులతోనే తృప్తి నందుచున్నారు. కాఁబట్టి మేము వెనుక బడియున్నా మను కారణమున అసంతృప్తులముగా నున్నా మన వీలు లేదు.”

భగవానులవా రీయాశ్రమాధికారము నేరీతిగా సంపాదింపఁ గల్గినది అప్పుడప్పుడు వారి నోటనే నేను విన్న విషయములనుండియును వారి శిష్యులనుండి యాలకించిన సంగతులనుండియును సేకరింపఁ గల్గియున్నాను.

1879 వ సం. వారు మధురకు 30 మయిళ్ల దూరమున నున్న యొక గ్రామమున జన్మించిరి. ఆమధురలో దక్షిణ హిందుదేశములలోని పట్టణములలో దేవాలయసంఖ్యకుఁ

ప్రసిద్ధి గన్నది. వీరి తండ్రిగారు సద్బ్రాహ్మణులు. అప్పటి కాలపు ప్లీడరీ వృత్తి. వారు ధర్మాత్ములై యెందఱో దీనుల కన్నవస్త్రముల నొసంగుచుండిరి. విద్యాభ్యాసముకొఱకీ బాలుఁడు మధుర వచ్చి అక్కడ అమెరికన్ మిషన్ వారిశాలలోఁ గొంత యింగ్లీషు నేర్చెను.

చిన్ననాఁడు శ్రీరమణులవారి కాటలన్నఁ గడు నిష్టము. కుస్తీలయందును గ్రుద్దులాటలయందును భయంకర నదీప్రవాహములలో నీఁత గొట్టుటయందును వారి కాస్థ యును చొరవయును మెండు. మతవేదాంతాదివిషయముల యందు వారి కెట్టి యాసక్తియు నుండలేదు. కాని వీరిలో నొక విశేషముమాత్ర ముండెడిది. నిద్రలో వీరు కుంభకర్ణు నికి గురువర్యులుగా నుండిరి. వీరు గాఢనిద్రలో నుండినప్పు డేసజీవ నిర్జీవసాధనములచేతను వీరిని లేపఁగొట్టుటకు వీ లుండలేదు. ఈసంగతి నెఱింగిన యతని తోడివిద్యార్థు లీతనిచే నితఁడు మెలఁకువగా నున్నప్పు డందినబాధలకై యితని నిద్రాసమయమున బాఢముగాఁ బ్రహరించుచుండిరి. ఇతని కదంతయును దెలియరాదు. పగటివేళ నతఁ డట్టి వారి నెల్లను రక్కియు పిడిగ్రుద్దులసమారాధన గావించియును తుక్కు రేఁగఁ గొట్టువాఁడు. అందులకు బదులుగా ఆబాలకులు రాత్రులయందు వీరిని పడకగదిలోనుండి బయటకు లాఁగుకొని పోయి యాఁట నేలయందు నిష్టము వచ్చిన

వడుపున మర్దించి తీసికొని వచ్చి మరల శయ్యాగృహమును జేర్చువారు. ఇట్టి నిద్ర యాత్మజ్ఞానావబోధముయొక్క చిహ్నమని మనస్తత్త్వవేత్తలు గ్రహింపఁగలరు.

ఒకానొక దినమున మధురనుండి వీరి యింటికి నొక బంధువు వచ్చెను. సంభాషణవశమున నతఁడు మహర్షిగారికి తా నరుణాచలయాత్రనుండి యప్పుడే వచ్చుచుండినట్లు తెల్పెను. ఆ శ్రీమదరుణాచలనామధేయమును వినఁగానే ఆబాలకునియొక్క హృదయాంతరమునం దేదో యొక చెప్పరాని కదలిక గల్గినది. ఆ దేవాలయ మెక్కడ నుండినది, అక్కడి కెట్లు పోవలయును. మొదలయిన విషయములను గూర్చి యతఁ డప్పటినుండి వారిని వారి నడుగుచుండెను. అప్పటినుండి యతని భావపరంపరలుగూడ దానినిగూర్చియే యుండెను. శ్రీయరుణాచలు డన నేమో తెలియకపోయినను ఆ యరుణాచల దేవాలయ మీ హిందూదేవాలయములలో నొకటి యనుటకంటె వేఱు సంగతి తా నరయకున్నను ఆ శ్రీమదరుణాచలవిషయ మాతని హృదయమునం దతిముఖ్యస్థానము నాక్రమించుకొన్నది.

ఒక రీతిగా మిషన్‌పాఠశాలయం దతని చదువులు సాఁగుచున్నవి. కాని పాఠములయం దతని తెల్వితేఁటలు బాగుగానే యుండినవి. పదునేఁడవ సంవత్సరమున నతని భావ

మునం దుండిన యీ యరుణాచలభావ ముద్రేకమును జెంది యతనిని మిక్కిలిగా నాకర్షించినది. ఒకానొకప్పు డతఁడు బంధువులకుఁగాని యుపాధ్యాయులకుఁగాని యెట్టి సూచనయు నొసఁగకయే బడి నిల్చిపోయెను. అతఁ డీరీతిగా ప్రపంచ వైముఖ్యము నొందు సంగతి అది జరగువఱ కెవ్వరికిని తెలియదు. అట్లతఁడు పాఠశాలనుండియును ప్రాపంచికవిషయములనుండియును నిల్చిపోవుటకుఁ గారణము సామాన్యులకుఁ దెలియరాని దయ్యును అతనికి తృప్తికరముగానే యుండినది. సామాన్యపు బడిపంతులవార్లు తెల్పు త్రోవనుండి యతనిని దప్పించి కర్మపరిపాకకాలమున నెల్లరికి లభించు జగదాచార్యుఁ డతనిని అమేయసౌఖ్యపదవీమార్గమునం దుంచినాఁడు. ఇట్టి పరిస్థితి యతఁడు మధురను నిరంతరము నెడబాయుట కొఱు వారములు ముందుగా నతనియం దేర్పడినది.

ఒకానొకనాఁ డతఁడు తన గదిలో నొంటరిగా గూర్చుండి యుండెను. అప్పుడు అతని కకస్మాత్తుగా మరణభయము కల్గినది. ఏరోగబాధయు పయినికిఁ గనుపడకున్నను తాను మరణము నొందవలసియుండు నను దృఢవిశ్వాస మతనికి గల్గినది నిజమునకా భయకారణము మరణాగమనము కాదు. అది మానసికపరివర్తనపద్ధతులలో నొకానొకటి. ఎందు కందురా? అందులకు దర్శింప వీలయిన శరీరచిహ్నా మేదియును లేదు. అయినను అతనికి మరణ మెంతయుఁ త్వరలోఁ గల్గవచ్చు నను నభిప్రాయము కల్గినది.

అతఁడు నేలపయిఁ బరుండి కన్నులను నోటిని మూసి కొని చేతులను గాళ్లను నిగిడించి ఊపిరిబిగఁబట్టి "ఇదే నేను మరణము నొందినాను. ఈ నాశరీరమును దీసికొని పోయి దహింతురు. కాని యీదేహముతో నేనుగూడ మరణించి నానా? "నే" నన౯గా ఈదేహమా? ఇది యిప్పుడు నిగుడుకొని నిశ్శబ్దముగా నున్నది. కాని నాయొక్క తత్త్వము దీనికి భిన్న మని నాకుఁ దోఁచెడిని."

తమయొక్క యాత్మికస్థితికి నేరీతిగా మార్పు గల్గినది భగవానులవారు పయిరీతిగాఁ దెల్పినారు. ఆటుపిమ్మట జరగిన సంగతి చెప్పుటకు సులభమే కాని తెలిసికొనుటకుఁ గష్ట మయినది. మెలఁకువలో నుండియే యతఁడొకానొక ధ్యాన సమాధిలో మునిఁగి, "నే"నన౯గా నేమను జిజ్ఞాసం జెందెను. తనకును తనశరీరమునకును సంబంధము లేదనియతనికిఁ దోఁచినది. మఱియును ఆ "నేను" మరణభయదూరముగా నుండు ననియును దోఁచినది. ఆత్మసుస్థిరమయిన దనియును అది మిక్కిలి యగాధములో నుండుటంజేసి దానినిన్నాళ్లుగాఁ దామెఱుంగ వీల్గాలే దనియును వారికిఁ దోఁచినది.

ఈయనుభవమునంజేసి శ్రీరమణులవారి స్వభావము మిక్కిలి మార్పు నొందినది.చేదువులు ఆఁటలు మిత్రులు మొదలయిన వానినిగూర్చిన యతని శ్రద్ధ బొత్తుగాఁ దగ్గిపోయిన దనవలయును. ఎందు కనఁగా ఇప్పు డతని హృదయము పర

తత్త్వాన్వేషణ నిష్ఠమైయున్నది. తన్మార్గదృష్టి వీరి కయాచితము గాను అకస్మాత్తుగాను లభించినది. ఎంత విచిత్రముగా నతనికి మరణభయము కల్గినదో యంత విచిత్రముగా నది యంత మొందినది. అప్పటినుండి యతనికి సుస్థిరముగా స్వాత్మానుభవ మేర్పడినది. ఇంతకు ముం దెవ్వరయినను దన్నుఁ బరిహాసము గావించినను ఆక్షేపింపక అట్టి బాలురను శిక్షింపక వదలు వాఁడు గాఁడు. ఇప్పు డెవ్వ రే మన్నను ప్రశాంతముగా నోర్చుకొని మిన్న కుండును. నలుగురతో నుండఁ గోరు తన మామూలుపద్ధతులను మాని యతఁడు వీ లయినంతవఱకు నొంటరిగా నుండఁ గోరును. అట్టి సమయమునం దతఁడు ధ్యానమగ్నుండై పరమాత్మానుభవము నొందుచుండును. దానం జేసి యతండు క్రమముగా నంతర్ముఖుఁ డగుచుండెను.

అతనిలో జరగుచున్న యీమార్పులు కొందఱిచే గమనింపఁబడుచుండినవి. ఒకనాఁ డతఁడు ఇంటియందు పాఠశాల పనిచేయుచు ధ్యాననిమగ్నుఁ డయ్యెను. ఈతని యన్న దానింగాంచి రోష మొంది యతనిపుస్తకము లన్నింటిని విసరి పాఱవేసి, "ఓరీ! నీవంటి వాఁ డిక్కడ నుండఁ దగఁడు. యోగాభ్యాసముగావలసినవాఁడ వీ చదువు నేల చదువుచున్నాఁడ?" వని యాక్షేపించెను. ఈ మాటలవలన శ్రీవారి హృదయ మప్పుడు కళుక్కు మన్నది. తమ తండ్రి యప్పటికి మృతుఁడు గాఁగాఁ దన తల్లినిగూర్చి తన పినతండ్రిగారును సహోదరులును జాగ్రత్త వహింతు రని శ్రీవారు విశ్వసించిరి. ఇఁకను

బర్యాలోచింపఁగాఁ దమ కక్కడ నుండవలసిన యవసర మేదియుఁ గాన రా లేదు. సంవత్సరముగా వారి హృదయము నందు నివసింపుచున్న శ్రీమదరుణాచలేశ్వరనామము వారి కప్పుడు స్ఫురించినది. కారణ మిదమిత్థ మ్మని వచియింపలేక పోయినను ఆయరుణాచలమునకే వెడలవలయు నని వారు నిర్ణయించుకొనిరి. అది యెదురు లేని యాత్మనిర్ణయము. కాని వాదపౌరుషేయ మగు మానసికనిర్ణయము గాదు. దానిని మార్ప నెప్పటికిని శక్యమును గాదు.

"నాయొక్క మక్కువ యంతయును ఈయరుణాచల మునుగూర్చియే యున్నది. ఏశక్తి నిన్ను బొంబాయినుండి యిక్కడికి రప్పించినదో అదియే నన్ను మధురనుండి యిక్కడికి రప్పించినది." అని శ్రీవారే నాకుఁ జెప్పియుండిరి.

ఆహృదంతరాకర్షణమునంజేసి శ్రీరమణులవా రప్పుడు తమ యింటిని పాఠశాలను తమ వారిని మిత్రులను విడనాఁడి అరుణాచలంబునకు వెళ్ల నిర్ణయించుకొనిరి. వారి యాత్మజ్ఞాన మంతకంతకు నెక్కువ యగుచుండెను. వారు వెళ్లుచు నొక జాబు వదలిరి. ఆ జా బిప్పటికిని ఆశ్రమమునందు భద్రపఱుపఁ బడియున్నది. అందలి సంగతి యిది.

"నాతండ్రిగారి యాజ్ఞప్రకారముగా నేను నాతండ్రిగారిని వెదకికొనుచు వెళ్లుచున్నాను. ఇయ్యది యొక్క ధర్మవిషయక ప్రయత్నము. కాఁబట్టి యీవిషయమునుగూర్చి యెవ్వరును

చింతింపఁ బనిలేదు. దీనిని వెదకుటకు ద్రవ్యమును ఖర్చుపెట్ట నవసరము లేదు."

జేబులో నొక మూఁడురూపాయల రొక్కముతోడను సంపూర్ణముగాఁ బూర్ణానుస్వారమయిన లోకజ్ఞానముతోడను సముద్రతీరమునుండి దూరమయిన దక్షిణహిందూదేశాంత ర్భాగమునకు వారు వెడలిరి. ఆప్రయాణమునందు జరగిన వింతలను గమనించినచో ఏదో యొక మహాశక్తి వీరిని బరిరక్షింపుచుండిన దని తెల్లము కాఁగలదు. వారు గమ్యస్థానము చేరినప్పుడు వారికి దేవుఁడే దిక్కు. అక్కడ నుండిన వారిలో నెవరితోను వారికి బరిచయము లేదు. కాని పరమార్థాన్వేషణా వైదగ్ధ్యము వారిలో జాజ్వల్యమానముగా వెలుఁగొందు చుండినది. ఒకానొక సమయమునందు వారి కీభౌతికవాంఛలు సంపూర్ణముగా నశించి, తనమీఁది వలువల నన్నిఁటిని బాఱ వైఁచి కేవలదిగంబరత్వముతో మంటపమునందు ధ్యాననిష్ఠతో ఆసీనుఁ డయ్యెను. ఆదేవాలయార్చకులలో నొకఁ డది కాంచి యాతని నాక్షేపించెను గాని లాభము లేకపోయినది. అప్పు డింకను నెందఱో యట్టి వారు వచ్చి యెంతయో ప్రయత్నింపఁగా శ్రీవా రొక కౌపీనముమాత్రము ధరింపఁ నొడఁబడిరి. నాఁటినుండి నేఁటికిని అదియే వారి వస్త్రధారణము.

అప్పటినుండి యాఱునెలలవఱకు వా రాశ్రీమదరుణా చలదేవాలయములోని యనేకమంటపములలో నక్కడక్కడ

వసించిరి. కాని యాదేవాలయమును వదలి వెడల లేదు. వారియొక్క మహనీయమయిన తపోవిధానమును గాంచి యెంతయును భక్తినొంది యొకానొకయర్చకుఁడు ప్రతిదినము నొకపూట వారికి బియ్యపు టన్నమును దెచ్చి యొసంగుచుండెను. అదియే వారి యప్పటి ప్రాణధారణధారకము. ఎప్పుడుచూచినను వారు ధ్యాననిష్ఠంజేసి మైమఱచియుంటంజేసి యింతకంటెఁ బెక్కుమాఱులు వారి కన్నము నొసంగ వీలు లేకుండెను.అట్టి నిష్ఠాసమయములయందు వారి కీ ప్రపంచజ్ఞాన మేమాత్రమును లేక యుండెను. కొందఱు తురక పిల్లవాండ్రట్టి సమయ మొకదానియందు వీరిపయిన మట్టిపెడ్డలు పడవేసి పలాయితు లయిరి. ఆసంగతి వీరి కెంతోసేపు జరగినతరువాతఁగాని తెలియ లేదు. తెలిసినను వారు దాని కెట్టి ప్రతిక్రియయును గావింప లేదు.

దేవాలయమున కెంద తెందఱో యాత్రికులు గుంపులుగుంపులుగా నరుదెంచుచుండుటవలన శ్రీవారి కక్కడ దపోవిధానమున కంతరాయముగా నుండుటంజేసి, వారచ్చోటువిడనాడి యూరి బయటఁ గల యొక గుడిని బ్రవేశించి యందుఁ దమ ధ్యాననిష్ఠను సాగింప సాఁగిరి. వారాయూరు చేరినదాది మూఁడు వర్షములవఱకు నెవ్వరితోడను మాటాడ లేదు. వా రేమి మౌననియమప్రతిజ్ఞ గావించి యుండ లేదు. కాని వారియొక్క యాత్మానుభవ

నిమగ్నతంజేసి యట్టి బహిర్జ్ఞాన మేర్పడినది. ఈయాథాత్మ్యాత్మ కాన్వేషణమునందు భగవానులవారు గమ్యస్థానము నంది నంతనే యాహ్వానమును వీడిరి. అది యుండవలసిన పని యేమి? మాట మొదటిరీతిగా నున్నను ఇప్పటి రమణులవారు తొంటివారా?

వారు తా మెవ్వరో యెవ్వరికిని జెప్పక మిక్కిలి రహస్యముగా నుంచిరి. కాని కొన్ని సందర్భములు సరిపడినందున వారి తల్లిగారికి వారు వెడలిన రెండు సంవత్సరములపిమ్మట వారి యునికి దెలియ వచ్చినది. ఆమె తన జ్యేష్ఠపుత్త్రునితో నటకు వచ్చి సాశ్రు రోదనపూర్వకముగా నింటికి రమ్మని యడుగుకొన్నది. వీ రందుకు లొంగకపోఁగా ఆమె సాక్షేపముగా తూలనాడి చూచినది. దానిపయినవా రొక కాగితముపయిన నొక గొప్పసత్త్వము నరులయొక్క మంచిచెడ్డలను నడపు ననియును ఆమె ప్రయత్నములు తనయొక్క పథమును మార్పఁ జాల వనియును వ్రాసిరి. మఱియును ఇఁకఁ దన్నుఁ గూర్చి చింతింప వల దనియును జెప్పిరి. ఆమె మఱేమి చేయఁ గలదు?

ఈసంగతి జరిగినతరువాత జను లనేకులు శ్రీవారి సన్నిధి కేతెంచుచు వారి యేకాంతమునకు భంగము గల్గించుచుండిరి. కాఁబట్టి వా రరుణాచలము నారోహించి యం దొక గొప్పగుహాయందు పలువత్సరము లుండిరి. ఇట్టి గుహా

లాపర్వతమునఁ గొన్నియే కలవు. వానియందు యోగులును సన్న్యాసులును నుందురు. శ్రీవారు నివసించిన గుహాయందు పూర్వమునుండి యొక మహానీయుని సమాధిగూడ నున్నది గనుక ఆగుహా ముఖ్యతర మయినది.

హిందువులలో మృతుల శరీరములను దహించుట సామాన్యపద్ధతి. కాని సిద్ధిఁ బొందిన యోగీశ్వరుల విషయమున నట్లు కాదు. ఎందు కనఁగా వారి శరీరములలో మనకుఁ బయినికిఁజూడఁ బ్రాణసంచారము కానరాక పోయినప్పటికిని వేలకొలఁది వత్సరములవఱకు వారి శరీరములయందు సామాన్యదృక్కులకు నగోచరముగాఁ బ్రాణవాహిని ప్రవహించుచుండుననియును దానం జేసి ఆశరీరము ముఱిగి పోవక యుండు ననియును విశ్వసింపబడుచున్నది. కాఁబట్టి యోగీశ్వరుఁడుసిద్ధి నొందినచో నతని శరీరమునకుఁ దైలాభ్యంగనము గావించి ధ్యాననిష్ఠలో కూర్చున్న రీతిగా సమాధిలో నుంతురు. అటుపిమ్మట ఆసమాధియొక పెనుబండతో బిగియింపఁబడును. అంతియ కాక "యోగీశ్వరులయొక్క శరీరములు కశ్మలము లేకుండును. గాన వానికి అగ్నిపరిశుద్ధి యవసరముండదు. కనుక అవి పూడ్చిపెట్టఁబడును" అను మఱియొక యభిప్రాయమును గలదు. ఈయోగీశ్వరులును సన్న్యాసులును గుహాలలో నుండుటకు నెక్కువగా నిష్టపడుదురు. పూర్వులట్టి గుహాలలో దేవతలను గూర్చి తపము గావించిరి. పార్సీ మతస్థాపకుఁడయిన జోరాస్టరును ఇస్లాము మతస్థాపకుఁడయిన

మహాత్మ్యమును తమయొక్క తపములను గుహాలయందే కావించిరి. హైందవయోగీశ్వరులు తమకు తగిన మంచిస్థలములు లభింపనియప్పుడిట్టి గుహాలలోను నేలమాళిగెలలోను నుండుటకు నొక కారణమున్నది. ఎందు కనఁగా బయటను వాతావరణశీతోష్ణస్థితులు పలుమాఱు మార్పుల నొందుచుండును. ఆమార్పులవల్ల వారికి తపోభంగము కల్గవచ్చును. గుహాదులలో నట్టిమార్పులు గల్గవు. ఇట్టిమార్పులు (పగలు ఎక్కువ వేడిమి. రాత్రి చల్లఁదనము) ఉష్ణదేశములలో నెక్కువ. అంతియకాక గుహాదులలో వెలుతురును శబ్దమును తక్కువగా నుండి వారి తపోవిధానముల కనుకూలతరముగా నుండును. అక్కడి గాడ్పును బీల్చుటవలనఁ గ్రమముగా నాఁకలియు నశించి వారికి శారీరసంబంధమయిన యవసరములు తగ్గిపోవును.

శ్రీరమణులవారిని ఆకొండమీఁది గుహ యాకర్షించిన మఱియొక కారణమక్కడియందమయిన ప్రకృతిరామణీయకము. ఆగుహాద్వారపు నెత్తపు టంచుమీఁద నిల్చుకొని చూచినచోఁ గ్రిందఁ గల విశాలమయిన మైదానమునఁ గల ఆచిన్న పట్టణమును తన్మధ్యమునందు నత్యున్నతమయిన గొప్ప దేవాలయమును ఆమైదానమున కావల నొక చిన్న గుట్టల వరుసయుఁ గాన నగును. ఇది యంతయు దర్శనీయమయిన ప్రకృతి సౌందర్యముగా నేర్పడియెడిని.

ఈచీఁకటి గుహాయందే రీతిగానో రమణులవారు పలు వత్సరములుండి, తమయొక్క యేకాగ్రములయిన ధ్యానవిధానములను సాగించుచుండిరి. వారి యోగావలంబనము హైందవశాస్త్రీయ పద్ధతి నవలంబింప లేదు. వారెక్కడను యోగమునుగూర్చి పఠింపలేదు. ఏగురువుక్రిందను అభ్యసింపలేదు. ఆత్మజ్ఞానమును సంపాదించుటకై వారికి మనంబునందుఁ దోఁచిన పథమున వారు నడచియుండిరి. ఆమార్గము వారికి తమలో నుండిన సర్వోపదేష్టయగు పరమాత్మునిచే నేర్పాటు చేయఁబడియుండెను.

1905 వ సంవత్సరమున ఏయాత్రికులమూలముననో ఆప్రదేశమునఁ బ్లేగు వ్యాధి వచ్చినది. అప్పు డది మిక్కిలి భయంకరముగా రేఁగినందున ఆయూరియందలి జను లెల్లరు నితర గ్రామములకుఁ బోఁ సాఁగిరి. అప్పు డాస్థల మంతయు నతినిర్జనుష్యమయినందున పెద్దపులులును చిఱుతపులులును తమ తమ నెలవులను వీడి వచ్చియాపురవీదులలోఁ గూడ సంచరింప సాఁగిన వన్నచో శ్రీవా రున్న గుహాప్రాంతమునకు వచ్చినవనుటలో నేమి సందేహ ముండును? కాని శ్రీవారాగుహాను వీఁడి యెందును జనక యెప్పటట్ల యందే యుండిరి.

బాలయోగీశ్వరులయిన శ్రీవారి నిప్పటికిఁ జాల పూర్వమునుండి యొక శిష్యుఁడు సేవింపుచునున్నాఁడు. ఆశిష్యుఁ డిప్పు డీలోకమున లేఁడు. (కాని-కొన్ని రాత్రులలో నొక

పెద్ద పెద్దపులి వచ్చి శ్రీవారి యెదుటను ప్రశాంతముగా నిల్చి వెళ్లిపోయిన దని యొక యైతిహ్యమును వినఁబడు చున్నది.)

యోగీశ్వరులును ఫకీరులును ఎంతటి సింహశార్దూల వ్యాళాదిదుష్టసత్త్వసంకులములయిన ఘోరారణ్యములయం దుండినప్పటికిని వారి కాదుష్టసత్త్వములనుండి యేలాటి బాధ యును గల్గక-వా రీజంతువులు తాఁకరాని యొకానొకదశ నొందిరా యన్నట్లు సురక్షితముగానుండు రని భారతదేశము నంతటను నొప్పుఁబడిన సంగతి. శ్రీరమణులవా రింకొకసంగ తినిగూడఁ జెప్పినారు. ఒకానొకనాఁటి మధ్యాహ్నమున వారు తమ గుహయొక్క ద్వారమునఁ గూర్చుండియుండఁగా నొక గొప్ప త్రాఁచుఁబాము తత్ప్రాంతమునందలి గండశిలాస మూహమధ్యమునుండి యేతెంచి వారి యెదుట నిల్చితన పడ గను విప్పఁగా శ్రీవారు కదల లేదు. ఈమానవుఁడును ఆజంతువును నొండొరులు కొన్ని నిమిషములుతేఱిపాఱఁ జూచుట జరగినది. కొంత సేపటి కంత సమీపమునకు వచ్చిన సర్పము శ్రీవారి నేమియుఁ గావింపకయే వెడలిపోయినది.

విచిత్రవర్తనులయిన ఈమహర్షులవా రాత్మకుహ రాంతరంతస్థితరహస్యంబు నన్వేషింపఁ గల్గినంతనే వారి యాధ్యాత్మికసంబంధైకాంతదశ కంత మొదవినది. ఈపయిన వా రంతగా నేకాంతముగా నుండ నవసరము లేదు. ఒక నాఁడు కావ్యకంఠ గణపతిశాస్త్రులవా రను నొక గొప్ప

బ్రాహ్మణపండితులు వీరిని సందర్శించిరి. అప్పటినుండియు వీరి బహిర్జీవనవిధానమునం దొక మా ర్పేర్పడినది. అనఁగా వీ రంతటి యేకాంతత్వమును గోరక నలుగురిలోనుండు రీతి నెచ్చించుకొనిరి. ఆగణపతిపండితులవారు విద్యాతపస్సాధనములనిమిత్తము శ్రీమదరుణాచలదేవాలయసన్నిధానమున నుండుటకై వచ్చియుండిరి. ఎందో ప్రస్తావనవశమున వారికీబాలయోగీశ్వరునివృత్తాంతము తెలిసినది. అంతట వారు కొండ నెక్కి శ్రీవారిని సందర్శించిరి. ఆసమయమున భగవానులవారదేపనిగాసూర్యునివంక నేకాగ్రదృష్టిగాఁగాంచుచుండిరి. అట్లు కొన్నిగంటలవఱకు అనఁగా ఆసూర్యుం డస్తంగతుం డగుదాకఁ గాంచుచుండిరి. ఒక యోగీశ్వరుఁడు సాయంకాలమున సూర్యునివంక నట్లు తేఱి చూచుట వింత గాదు. కాని యీవిషయము తెలియని యైరోపీయుల కిది నమ్మఁదగినది కాక పోవచ్చును. ఒకానొక సమయమున మంచి మిడియెండలో నేను గొండ నెక్కఁ బ్రయత్నించిన విషయము నాకు జ్ఞాపకమున్నది. నేను తిరిగి వచ్చునప్పటికి మిట్టమధ్యాహ్న మయినది. ఏప్రక్కను తలఁ దాచుకొనుటకు ఛాయాదాయకవస్తు వేదియు లేదు. ఎండయా? మండిపోవుచున్నది. ఆయలసటంజేసి నేనొక త్రాఁగుఁబోతువలె సోలిపడి పోవుచుంటిని. ఆకారణమునఁజేసి శ్రీరమణులవా రెట్టియెండ మండించు మార్తాండబింబమును దేఱి పాఱఁ జూచు విషయము తప్పక గొప్ప విశేషమే కదా?

ఆగణపతిపండితులవారు భారతీయజ్ఞానగ్రంథములలో ముఖ్యమయినవాని నన్నింటిని సుమారు పదిరెండు వత్సరములు పఠించి యాత్మజ్ఞానసంపాదనార్థము ఘోరమయిన తపంబు గావించియుండినప్పటికిని వారి మనస్సునం దెన్నియో సందేహములును చిక్కులును నిల్చిపోయియుండినవి. వారు శ్రీవారి నొక ప్రశ్నము నడిగిరి. అ ట్లడిగిన పావుగంట సేపటికి శ్రీవారు వారి కత్యాశ్చర్యము కల్గునట్లుగా ప్రత్యుత్తర మొసంగిరి. అప్పుడు పండితులవారు తమ డెందంబునుం దలంబుగాఁ గొందలంబు నందించుచున్న సందియంబులను జిక్కులనుగూర్చిన మఱి కొన్ని ప్రశ్నములను శ్రీవారి నడిగిరి. వారి యా యధ్యాత్మికజ్ఞానసంబంధములయిన సందేహములును జిక్కులును వారిలో నెన్నో యేండ్లుగా నున్నవి. అట్టివాని నన్నింటిని భగవానులవా రాపండితులవారి యాశ్చర్యము నినుమడింపుచుఁ బ్రత్యుత్తరముల నొసంగి పటాపంచలు గావించిరి. అంతఁ దత్పండితప్రకాండులు బాలయోగీశ్వరులగు ఈశ్రీవారికి సాష్టాంగదండప్రణామంబు గావించి యప్పటినుండి వీరికి శిష్యు లయిరి. ఆశాస్త్రులవారికి వేలూరిలో నెందఱో శిష్యులు గలరు. వారు తిరువణ్ణామలలో నీ సందర్శనము గావించుకొని వేలూరికి వెళ్లి భగవానులవారినిగూర్చి యాశిష్యబృందంబునకుఁ దెల్పి శ్రీవారు మహర్షివర్యు లనుటకు సందేహము లే దనిరి. "ఎందు కనఁగా

శ్రీవారి ఆత్మజ్ఞానస్థాయి యున్నతతమమయినది. వీరు చెప్పిన ప్రత్యుత్తరములు మిక్కిలి తేఁటతెల్లముగా నున్నవి. అట్టి నిర్ధారణములు తాము చదివిన యేగ్రంథములోను గానరా లే”దనియును పండితులవారు నిజశిష్యులతో ననిరి. అప్పటి నుండి క్రమేణ శ్రీవా రభిజ్ఞులలో మహర్షి నామధేయముతో వ్యవహరింపఁబడసాఁగిరి. ఈసంగతి జనసామాన్యమునకు వ్యాపించి వారు వీరు దైవమే కాక యన్యము గా రని పూజింపఁగోరిరి. వారి శిష్యులలో ననేకులును ఆయూరి వారిలో ననేకులును భగవానులవా రొక దేవతయే యని నాకుఁ దెల్పియున్నారు.

శ్రీవారి శిష్యులగు కొందఱు ఆ గిరిక్రింద నొక ప్రదేశమున కొయ్యతో నొక కుటీరమును నిర్మించి శ్రీవారిని బ్రార్థించి యం దుండునట్లు చేసిరి. శ్రీవారి జనని యప్పు డప్పుడు శ్రీవారిని గాంచ వచ్చుచుండెను. ఇంతలో శ్రీవారి యన్నగారు మరణించినందున వారి తల్లిగా రాశ్రమమునకు వచ్చి తన నక్కడనే యుండనీయవలసినదిగా కొమరుని నడుగుకొనెను. అందులకు శ్రీవారు సమ్మతింపఁగా ఆమె ఆఱు సంవత్సరము లందు నివసించి క్రమేణ తన కొమరులయిన భగవానులవారికి శిష్యురాలై తచ్ఛేవగా ఆయాశ్రమమునందు వంటపని చేయుచుండెను. ఆ యేండ్లపిమ్మట ఆమె స్వర్గస్థురా లయ్యెను. అప్పు డామెయస్థు లాగిరీంద్రమూలముననే సమాధి గావింపఁబడి దానిపయిన కొందఱు భక్తులచే శివలింగము ప్రతి

ష్ఠింపఁబడినది. శ్రీవారికి భౌతికశరీరమును బ్రసాదించిన యా మహాత్మురాలి గౌరవార్థ మక్కడ నిరంతరమును అఖండదీపారాధనయును పుష్పబిల్వార్చనయును జరుగుచుండును. ఈ రీతిగా ఆమె యాత్మకు గౌరవము జరుగుచుండెను.

కాలక్రమమున శ్రీవారి యశస్సు వ్యాపించినది. కనుక ఆతిరువణ్ణామలకేతెంచిన యాత్రికు లెల్లరును ఆసందర్భమునఁనే భగవానులవారినిగూడ సందర్శించుకొని పోవుట జరగ సాగినది. ఇటీవల నేయెందఱో ప్రార్థనపయిననో శ్రీవారాకొండ క్రింద గట్టఁబడిన పెద్ద కూటము నలంకరింప నియ్యకొనిరి. అక్కడ వారును వారిశిష్యులును వసియించుచున్నారు.

శ్రీవారన్నముతప్ప నేమియు నడుగరు. ద్రవ్యమును తాఁకకుండుట వారి నియమము. ఇప్పుడు వారి కేర్పడియుండు నేవిధమయిన యాస్తియయినను శిష్యులచే వారికి బలవంతముగా సమర్పింపఁబడినదే. మొదట మొదటను వారు కేవలమేకాంతముగా తమ తపోవిధానమును సాఁగించుచుండినప్పుడును మౌనముఁబూని యాత్మశుద్ధికై ప్రయత్నించునప్పుడును మిక్కిలి యాఁకలి యయినప్పుడు భిక్షార్థమై భిక్షాపాత్రమును గైకొని గుహను వదలి వెళ్లెడివారు. ఒక వృద్ధవితంతువునకు వారియందుఁ గనికరము గల్గి బలవంతముపయినఁ బ్రతిదినమును తప్పక అన్నమును వారున్న గుహకుఁ గొనివచ్చి సమర్పింప సాఁగినది. ఎన్నియో గొప్పబహుమానముల నెందఱో సమర్పించుటకు రాఁగా వారు వానిని వాపసు చేసినారు.

ఒకానొక రాత్రి కొందఱు బందిపోటువాం డ్రాయా శ్రమముఁ జొరఁబడి యున్నదంతయును దోఁచుకొనిరి. వారికి లభించినది మఱునటి రోజుల కుంచుకొన్న పయికమునకన్న నెక్కువ యేమియు లేదు. ఎక్కడనయిన నేమయిన దాఁచి యుంచిన నియ్యవలసిన దని వారు భగవానులవారిని బాధించిరి. కాని క్షమాసముద్రులయిన శ్రీవా రద్దాని నంతయును శాంతముగా నోర్చికొనుటయే కాక వా రందఱిని భోజనము చేసి వెళ్లవలయు నని యడుగుకొనిరి. వారియందు శ్రీవారి కెట్టి కోపమును గల్గకపోవుటయే కాక వారి యజ్ఞానదశకు మిక్కిలి చింతయును జెందిరి. తన నొరులు బాధించినప్పుడు ఏసుక్రీస్తుమహాశయుని మనఃప్రవర్తనయు నిట్టిదే. ఆచోర మహానుభావు లెల్లరు నక్కడినుండి వెడలిపోయిరి. కాని సంవత్సరము తిరుగకయే వా రొనరించిన మఱియొక దోపిడినేరమునకై వారు సర్కారువారిచేఁ బట్టువడి శిక్ష నొందిరి. పాశ్చాత్యు లనేకు లీశ్రీవారిజీవితము ఈరీతిగా నుండుట నెఱింగి యిది వ్యర్థ మనియే నిర్ణయింపవచ్చును. కాని కొంద అయినను ప్రపంచమున కెడముగాఁగూర్చుండి లోకకళ్యాణార్థమై ఆత్మపర్యాలోకనముతో ఈసాధారణ సాంసారికవ్యథాకల్లోలసంచలత్ప్రాపంచికరీతులఁ, గాంచుట మంచిదే యని తోఁపక మానదు. ఒకానొక విషయమున మునిఁగియుండు వారికన్నఁ బయినుండి చూచు వారికి వానియొక్క మంచి చెడ్డలనుగూర్చి విశేషముగా తెలియు నవకాశమున్నది. తన

పయినఁ దన కధికారమును సంపాదించుకొన్న యోగీశ్వరుఁడు ప్రాపంచికవిషయములకు లోఁబడి తనుకులాడు నొక మూర్ఖుని కన్న నెక్కువ కాకపోవునా?

శ్రీవారి మహత్త్వమునకు దినమును దృష్టాంతము లెన్నియో పొడచూప సాఁగినవి. ఆయాశ్రమమును దర్శింప వచ్చిన వారిలో నొక మాలఁడు శ్రీవారి చరణసన్నిధిఁ జేరి తన మానసికార్థికవ్యథల నేకరవుఁ బెట్టెను. అప్పుడు శ్రీవా రేమియు ననక మిన్నకుండిరి. మౌనమును కేవలత్వమును వారి స్వాభావికధర్మములు. ఒక్కొక రోజున వా రెన్నెన్ని మాటల వచియించునది సులభముగా లెక్కించి చెప్పవచ్చును. కాని యాయార్తునిపయిన భగవానులవారు దృష్టిని బ్రస రింపఁజేతురు. రెండుగంటల పిమ్మట ఆవచ్చినతఁ డాత్మికముగా బలధైర్యముల నొంది వంత తగ్గి వెడలును.

శ్రీవా రీరీతిగా నితరుల కేరీతిగా సాయము గావింపఁ గల్గునది నా కిప్పుడిప్పుడర్థ మగుచున్నది. వారి యంతరాళము నుండి యార్తుల యాంతర్యములోనికి నిశ్శబ్దముగాను నిశ్చ లముగాను ఒక ప్రశాంతమయిన శక్తి ప్రవహించుచున్నది. ఈవింతయయిన వైద్యుత్క్రియాకలాపమునకుఁ గారణ మేమో శాస్త్రపరిశోధనమే నిర్ణయింపవలయును.

ఒకానొక కలాశాలావిద్యార్థియయిన బ్రాహ్మణుఁ డొక నాఁడు శ్రీవారిని జేరవచ్చి కొన్ని ప్రశ్నల నడిగెను. ఎవ్వ

రేప్రశ్నల నడిగినను శ్రీవారు వానికి మాటలతోఁ బదు లిత్తురో లేదో చెప్పుట కెవ్వరికిని దరము కాదు. కాని యెన్నో సారులు వారు మౌనముతోనే యనేకుల సందేహములను దీర్చుచుందురు. కాని నేఁ డేమో వా రాబ్రాహ్మణవిద్యార్థికి తమ స్వాభావికమయిన యర్థగాంభీర్యయుక్త మితభాషణ ముతోఁ బ్రత్యుత్తర మొసంగిరి. దాన నయ్యాగంతుకుని సంశయంబు లన్నియును బటాపంచ లయిపోయినవి.

ఒకానొక సమయమున ఆశ్రీవారి కూటమునందుఁ జేరిన సంద్రష్టల సంఖ్య కొంచెము హెచ్చుగానే యుండినది. అప్పు డొకానొక రక్కడికి వచ్చి ఆయూరిలోని పరమదుర్మార్గుఁ డొకఁడు నాఁటి మధ్యాహ్నమున మరణించె నని చెప్పఁగా నందున్నవారిలోఁ బలువురు పలురీతులుగా ఆమృతునియొక్క దొసంగులను గొంత నేఁపటివఱకు తుములముగా నుగ్గడించిరి. కడపట అంతయు నిశ్శబ్దము కాఁగా శ్రీవా "రామృతుఁడు తనను బరిశుద్ధముగానే యుంచుకొన్నాఁడు. ఏ మందురా? అతఁడు ముప్పూటలు స్నానము చేయువాఁడు." అని ప్రశాంతముగా వచియించిరి.

ఒక హాలికుఁడు భార్యతోడను కొమరితతోడను వంద మయిళ్లకన్న దూరమునుండి శ్రీవారి దర్శనార్థ మొకానొకనాఁ డేతెంచెను. వానిలో విద్యావత్తగాని యాలోచనశక్తిగాని లేనేలే వనవచ్చును. అమాయికత్వపుఁబ్రోవు. శ్రీవారొకదేవా వతారమని దృఢమయినవిశ్వాసము. అట్టి విశ్వాసముతోనే యా

కుటుంబ మంతయును భగవానులవారికి సాష్టాంగదండప్రణా మంబులు గావించి కొంత దూరమున నుండిరి. వారెట్టి కోరి కను గోర లేదు. ఒక మాటయయినను మాటాడ లేదు. మిక్కిలి భయభక్తులతో దవుదవ్వుగా ఆకూటముననుండి శ్రీవారిని దర్శనము గావించుకొనుచుండిరి. భగవదవతారమయిన భగ వానులవారి దర్శనమువలననే సమస్తపాపములును పటాపంచ లయిపోవు నని వారి విశ్వాసము. శ్రీవా రెల్లరియందును తమ యనుగ్రహమును బ్రసరింపఁజేసి వారి మానసికార్తిఁ బోఁగొట్టు ప్రయత్నము గలవారు. మఱియు సమత్వమునకు వారు స్థాన మనం బరఁగుదురు. వారి హృదయమునందు శ్రీకృష్ణునకును క్రీస్తునకును మహమ్మదునకును సమస్థానము లే యుండును. అక్కడ నే నొక వృద్ధబ్రాహ్మణుని జూచితిని. అతని వయస్సు సుమారు డెబ్బదిఅయిదు వత్సరము లుండును. అతఁడు ప్రాయమున రయిల్వేస్టేషన్‌మాస్టరుగానుండి యిప్పుడు విశ్రాంతివేతనములో నున్నాఁడు. అతనియఱువదవయేట నుద్యోగమునుండి విరమించుకోఁగా కొంతకాలములోనే యతని యిల్లాలు కాలధర్మము నొందుటంజేసి యతని కీసంసా రికమయిన బెడఁదలు పోయినవి. పిమ్మట నతఁడు సాధు సజ్జన యోగీశ్వరులను సందర్శించుచు భారతదేశ మంతయును పదు నాలుగు సంవత్సరములు సంచరించినాఁడు. ఈప్రయత్న మంతయును దనకు సరిపడు గురువర్యుని సంపాదించుకొనుట కొఱకే. అతఁడు ఈహిందూదేశముచుట్టును మూఁడుసార్లు

ప్రదక్షిణము గావించినప్పటికిని పయి నెన్నిన రీతిని తన మదికి నచ్చిన గురురత్నమును గానఁ డయ్యెను. కనుక అధ్యాత్మిక విషయములనుగూర్చి యతఁడు తనలో తానే తలపోసికొను చుండెను. కాని తనకుఁ దేలిన నిర్ణయములను పెద్దలబోధలకుఁ బోల్చి చూచుకొనఁగా కనుపించునట్టి "ఫరకు"ను చూచు కొని దుఃఖించెడివాఁడు. అతని ముసలి మొగమునందు గొప్ప తెలివితేఁటలు కానుపడకపోయినప్పటికిని ధర్మమును న్యాయ ప్రవర్తనమును తాండవించుచున్నవి. ఏకారణముననో నా కాతనియందు మక్కువగల్గి యతనికి నే నేదో మేలు చేయఁ బూనినట్లు తెల్పఁగా తనను శిష్యునిగా నంగీకరింప వలయు నని నన్నుఁ బ్రార్థించినంత నాయాశ్చర్యమునకు మేరయే లేదు. "మీగురువు మీసమీపముననే యున్నాఁ"డని నేను వారికిఁ జెప్పి భగవానులవారికడకు నతనిని బిల్చుకొని పోయి తిని. శ్రీవారి నతఁడు గురువర్యునిగాఁ గైకొనుట కెంతో సేపు పట్టలేదు. అతఁడు శ్రీవారి శిష్యులలో నొక యుత్సాహ పరుఁడయిన వాఁడు.

ఆకూటమునందు చీనాంబరధారియైన ముక్కద్దములఁ దాల్చిన మహాశయుఁడు గలఁడు. అతఁ డొక జిల్లాన్యాయాధి కారి యని తెలిసినది. ఆతఁడు శ్రీవారియం దత్యంతభక్తి ప్రపత్తులు గల శిష్యులలో నొకరు. సంవత్సరమునకు నొకసారి యైనను వచ్చి భగవానుల వారిని సందర్శించుకొని పోవు చుండును. అట్టి గొప్ప విద్యాబుద్ధికౌశలోన్నతోద్యోగములు

గల్గిన యాతఁడు దిగంబరత్వమునఁ దూఁగుచుండు పెద్ద వారితోఁ గూడఁ గలసిమెలసి సంచరించుట యక్కడఁ జూడఁ బడినది. ఏభావము చిన్న-పెద్ద, సాహుకారు-బీద, రాజు-సేవ కుఁడు, అను భేదము లేక యందఱిని శ్రీవారిసన్నిధికి దర్శ నార్థము గొనివచ్చెడినో అది జ్ఞానకళయే కదా? దానివలననే పయి మెఱుంగు రంగుల హొరంగుభేదము లన్నియును భంగము నొంది సత్యపుతెఱంగు గాన నగుచున్నది.

శ్రీవారి సన్నిధి కొక యువతీమణి యేతెంచినది. ఆమె కూఁతురుగూడ వచ్చినది. ఆబాలిక యందమయిన దుస్తులలో నుండినది. వా రిరువురును భగవానులవారికి నమస్కరించిరి. అప్పుడు శ్రీవా రాకూటమునందుఁ జేరియున్న శిష్యబృంద ముతోఁ గొన్ని ముఖ్యమయిన యాంధ్యాత్మికాంశములను జర్చింపుచుండిరి. అప్పు డాతల్లిబిడ్డలు కొంచె మెడమై నిశ్శబ్ద ముగాఁ గూర్చుండిరి. హిందూస్త్రీలకుఁ జదువు ప్రాముఖ్య ముగా నున్నట్లు తోఁచదు. వారికిఁ దమ వంటపనులు తప్ప నితరలోకవిషయమునుగూర్చిన జ్ఞాన మున్నట్లు కనుపట్టదు. కాని మహానుభావులయొక్క సన్నిధిలో వారికిఁగూడ గొప్ప సంగతు లవగతములగును.

సాయంసంధ్య యయినంత కూటమునందుఁ బ్రార్థన.

ఆసమయము శ్రీవారు మిక్కిలి ప్రశాంతముగా ధ్యాన నిష్ఠను బ్రవేశించుటం జేసి యొఱుంగ నగును. అప్పుడు వారి

యొక్క దృష్టి బహిర్వ్యాపారములను మాని యంతర్ముఖ మగును. ఈరీతిగా శ్రీవారు ప్రతిదినమును ధ్యానమగ్ను లగుచుందురు. అప్పుడు నేను వారి సన్నిధిలో నుండు భాగ్యము కల్గినది. తత్ఫలితముగా నాభావములు క్రమక్రమ మున నగాధాగాధతరవస్త్వన్వేషణము గావింపసాఁగినవి. అంతరమయినప్రకాశ మేర్పడక ప్రాయికముగా వారితో సంబంధ మేర్పడుటకు వీలుపడదు. ఆ జ్ఞానానుభవము శ్రీవారి హృదంతరజాజ్వల్యమానజ్ఞానతేజస్సునుండియొకస్ఫులింగము చింది యంధకారమయమయిన జిజ్ఞాసుహృద్వీధిని బడినట్లు తోఁచును. ఈధ్యాననిష్ఠవేళలలోనే వారు నాయొక్క మనం బున తమయొక్కజ్ఞానతేజోనిధానమువంక కాకర్షించుకొనుచు న్నట్లు తోఁచును. అట్టి సమయములయందే యీమహామహుఁ డు మాటాడునప్పటికన్న మిన్నకుండునప్పుడే యెక్కువగా బోధింపఁగలఁ డని యెవనికేనియు నర్థము కాఁగలదు. ఆ రీతిగా ధ్యాననిష్ఠలో వా రుండినఁ జాలును. ఏమాటలచేతను ఏచేఁతలచేతను గల్గని ప్రశాంతిని తత్సన్నిధియే భక్తులకు సమ కూర్పఁగలదు.

ఈరీతిగా వారినుండి ప్రవహించునట్టి యాకర్షకశక్తి యొక్కొకసారి యత్యధికముగా నుండునని నాయనుభవము. అట్టి సమయమునందు వారు నాకెంతచిక్కయినదియును ఎంత నా కనిష్టమయినదియును నగు నాజ్ఞను నొసంగుదురుగాక. అందులకు లొంగి శిరసావహించి చేయవలసి యుండును. కాని

శిష్యులనుండి దాస్యము చేయించుకొనుటలో శ్రీవారు కట్టి కడపటివారనవలసియుండును. వారి సన్నిధియందు నెల్లరికిని ఎల్లవిధంబులయిన స్వేచ్ఛయు నుండును. ఈపద్ధతినిబట్టి చూడఁగా హిందూదేశమునందు నేను గాంచిన యితరులగు యోగీశ్వరులును గురువులును అయిన వారికిని వీరికిని గొప్ప భేదమే కనుపట్టుచున్నది.

నేను తొలుదొల్త శ్రీవారినిదర్శనము చేసికొన్నప్పుడు వారు నాకు నిర్దేశించిన ధ్యానపద్ధతిని నేను సాధింపఁ బ్రారంభించితిని. వారు నే నడిగిన ప్రశ్న లన్నిటికి నొకటే జవాబు చెప్పియుండిరి. అందుకై నన్నుఁగూర్చిన చర్చ నేనే ఈరీతిగాఁ బ్రారంభించితిని.

" నే నెవరు" రక్తమాంసమయిన శరీరమా? లేదా మనస్సు, భావములు, విషయానుభవములు అను నవి యితర మనుజులనుండి నను వేఱుపఱచుచున్నది. వానిలో నే నెద్ది యగుదును?

ఇంతవఱకుఁ బయి నెన్నిన ప్రతివస్తువు "నేను" గానే ధారాళముగా నంగీకరింపఁబడుచుండెడిది. కాని భగవానులవారు వాని నట్లే యంగీకరింపరా దని హెచ్చరించి యుండిరి. కాని యానిర్ణయమునకుఁ జేరఁదగినట్టి రీతిని వారు సక్రమమయిన బోధ చేయలేదు. వారి సందేశముయొక్క సారాంశం బిది:—

నిరంతరమును "నే నెవరు?" అను విచారణమును చేయుచుండవలయును. "ఆనేను" అనునట్టి భావ మెక్కడి నుండి ప్రారంభమగునో తెలిసికొనఁ బ్రయత్నింపవలయును. ఈరీతిగానే విచారణ సాగించుచుండవలయును. దృష్టి నంతర్ముఖము గావింప నగును. ఒకానొక నాఁటికి భావపరిభ్రమణము తగ్గి, జ్ఞానోన్మీలనము విచిత్రముగా వెల్లవచ్చును. అజ్ఞానో జీవము నే వెంబడించి యితరాలోచనలను మానినచో అయ్యది యే గమ్యస్థానమును జేర్పఁగలదు.

ప్రతిదినమును నాకును నాభావపరంపరకును యుద్ధము అట్లు పోరాఁడి పోరాఁడి యెట్లెట్లో నామనో౽ంతరాంతరములకు మెల్లమెల్లగాఁ ద్రోవ గావించుకొందును.

శ్రీవారి సాన్నిధ్యానుగ్రహములవలన నాధ్యాన విచారణములు ప్రశాంతిగా కొనసాఁగి సార్థకత్వము నొందుచున్నవి. ఒక విధమయిన గొప్పయాస్థయును శ్రీభగవానుల వారి తోడ్పాటును జేరఁగా నాప్రయత్నములయందు నాకుఁ బ్రోత్సాహము హెచ్చెడిని. శ్రీవారి యద్భుతమగు శక్తి నా యందుఁ బనిచేయుచుండు సమయములను నే ననేకపర్యాయములు గురుతింపుచుందును. అప్పుడే నేను నాహృదయకుహారములోని యంతరతరవిషయములను బరిశీలింపఁగల్గి యాత్మను సమీపించుచుందును.

ప్రతిసాయంకాలమును శ్రీవారును శిష్యబృందమును ఆకూటమునుండి భోజనశాలలోనికి వెడలుదురు. సాయం

కాలములయందు నేను అక్కడఁగాని నాబసయందుఁగాని భోజనము చేయఁదలంపను. కనుక వారువచ్చువఱకు నేనందే యుందును. ఆయాశ్రమమందు లభించు భోజనవస్తువు లన్నిటిలోను పెరుగు నాకు నచ్చినది. ఎందు కందురా? దాని రుచి నాకు మనోహరముగా నుండును. ఈవిషయమును గనిపెట్టి భగవానులవారు ప్రతిరాత్రిని ఒక గిన్నెడు పెరుగును నాకుఁ దెప్పించి యిప్పింతురు.

భోజనానంతర మరగంట గడచినతరువాత శిష్యులును ప్రేక్షకులును కూటమునందు వల్లెలను గప్పుకొని పరుందురు. శ్రీవారాసోఫాపయిననే యొక శ్వేతవస్త్రమును గప్పుకొని పరుండఁగా నొక ప్రియశిష్యుఁడు వారికి శరీరము చక్కఁగాఁ బట్టును. అంత నే నొక చేతిలాంతరు గైకొని నా యేకాంతమయిన కుటీరమునకు వెళ్లుదును. త్రోవలో మిణుఁగురుపురుగు లెంతయు నాకనులకు వింతగొల్పును. ఆతోఁటలోని పూలచెట్లను బొదలను దాఁటునంతవఱకీమిణుఁగురుఁబురుగులమూక ఒక్కొకసారి మామూలునకన్న రెండుమూఁడు గంట లాలస్యముగా—అనఁగా అర్ధరాత్రి సమీపించుచుండునప్పుడు నేను నాకుటీరమునకుఁ జేరుకొనుచుందును. అప్పు డక్కడనుండు పొదలలోనంతటను ఈవింతయయిన వెలుంగుపురుంగులు చెలంగుచుండును. అక్కడ నడుచునప్పుడు త్రోవలో తేళ్లనుగూర్చియును పాములనుగూర్చియును జాగ్రత్తగా నుండనగును. ఆనడచునప్పు డొకానొకసమయములో నేను

ధ్యాననిమగ్నుఁడ నయియుండు కారణమున వీని నన్నిటిని లెక్కింపక నడచి నాయునికికిని జేరుకొందును. నే నాలోనికిఁ బ్రవేశించి తలుపు గడెవైచుకొని ఆగ్రామ్యపద్ధతి ప్రదేశమునఁ బరుందును. అట్లు నిద్రింపఁ బోవునప్పుడు నాకుఁ గనుపడుచుండునవి ఆప్రక్కనుండు తాటిచెట్టును దానిపయి నాడు చంద్రబింబమును తజ్జ్యోత్స్నయును.

## విస్మృతతత్త్వవిషయములు

ఒకానొక మధ్యాహ్నమున నొక ప్రేక్షకుఁడు శ్రీవారి కూటములోనికి సగౌరవమయిన నడకతో నరుదెంచి శ్రీవారి సోఫాకు సమీపమునఁ గూర్చున్నాఁడు అతని శరీరచ్ఛాయ శ్యామలము. వదనము తేజోవంతము. నోట మాట లేదు. శ్రీవా రతనికి సమందహాసస్వాగత మొసంగిరి.

ఈతని యాకారము నాయొక్కహృదయము నెంతయు నాకర్షించినది. ఈతనియందు బుద్ధుని పద్ధతి గాననయ్యెడిని. అతనిమోమునందత్యంతప్రశాంతత్వము తాండవించుచున్నది. నే నతనివంకఁ జూడఁగా నతఁడు నావంకకే తదేకదృష్టిగాఁ జూడ సాఁగెను. ఆమధ్యాహ్న మంతయును నం దుంటిని. అతఁ డొక్క మాటనయినను నాడ లేదు.

మఱునాఁ డతని సమావేశము నే నేరీతిగాను అనుకొననిరీతిగా జరగినది. కూటమునుండి నాబసకు తేయాకునీరును జేసికొనుటకై చేరఁ బోయితిని. నేను వాకిటిలో నడుగిడుసరి

కొక పెద్ద త్రాచుం బామాగదియందు బురబురం బ్రాకుచుంటం గాంచినంత నాపయిని ప్రాణములు పయిననే యెగిరిపోయినవి. అది నాపాదముల కొక కొన్ని యంగుళముల దవ్వుననే యుండి నది. అప్పుడు నాభీతి యేరీతిగా నుండునో యూహించుకొనుట కేమయిన సాధ్యమగు నేమో కాని వ్రాయుటకయినను జెప్పుటకయినను సాధ్యమే కాదు. నేను దానివంకను అది తనపడగ నించుక యెత్తికొని నావంకను గాంచ సాంగితిమి. ఆ నిర్ఘాంతపాటునంజేసి నా తనువంతయు బిఱ్ఱబిగిసి కొన్న ట్లయినదన్ననో సందియము లేదు. అట్టి పరిస్థితిలోంగూడ నామనస్సులో నొక భాగము దానియొక్క సుందరమయిన యాననరీతినిజూచి మెచ్చుకొనుచుం బరికింపసాగినది. ఆరీతిగా నదియు నేనును గొంత సేపు నిల్వంగా నెట్టకేలకు నాశరీరము నాకు స్వాధీనమై వెనుకకుం దగ్గి యొకబడిలెను సంపాదింప నాలోచించులోపల ఇంతలో గతదినమునం గనుపడిన పయిన నెన్నినవ్యక్తి వచ్చుచుండుట నా కగుపట్టినది. అతండు నాకుటీరమును సమీపింపంగానే యక్కడి యప్పటి సంగతి నంతయు గ్రహించెను. అతం డెట్టితొందఱనేనియును జెందక గదిలోం బ్రవేశించెను. నేను ఆపామునుగూర్చి యతనికిం దెల్పుచు బిగ్గఱగా నఱచితిని. దాని నతండు లెక్కింపక ఆపామువైపు నకుం దన రెండు చేతులను జాంచెను. అప్పుడు నేను దిగులు పడిన రీతి కంతు లేదు. ఆపాము నోరుదెఱచి నాలుక నాడించు చున్నదే కాని అతని నేరీతిగాను బాధింప నుంకింప దయ్యెను.

నే నఱచిన యఱపును విని యంతటిలో ఆప్రక్క నున్న కుంట కడనున్న యిరువురు మనుష్యులు త్వరగా నక్కడకు వచ్చు చుండిరి. ఆసమయమున ఇంతకు ముందు నేను దెల్పిన నవీనా గంతుకుఁడా సర్పమును మెల్లగాఁ దోఁకపై జోకొట్టెను. ఇంతలో నావచ్చుచున్న యిరువురు నక్కడకుఁ జేరునంతటిలో ఆయురగము తోఁక జాడించి త్వరలో నవ్వలికి దాఁటుకొని పోయినది అప్పు డక్కడకు వచ్చిన వారిలో నొకఁడగు ఆయూరి వర్తకుఁడు "అదియొక చిన్న నాగుఁ బా" మని నుడి వెను. మొదట నేతెంచిన వ్యక్తి యాఘోరసర్పమును దాఁకిన వింతను గూర్చి నేను నాశ్చర్యుఁడ నయి ప్రశంసించితిని. అందుల కావర్తకుఁడు "అతఁడు యోగి రామయ్యగారు. భగ వానులవారి శిష్యులలో నగ్రగణ్యులగువారిలో నొకరు. మహనీయులు" అని యుత్తర మొసంగెను. వారు మౌన వ్రతమున నుండుటంజేసి వారితో నాకు మాటాడ వీలుపడ లేదు. అంతియ గాక వా రాంధ్ర దేశస్థులు. వారికి ఇంగ్లీషు భాష తెలియదు. నాకో తెలుఁగు రాదు. వారు పరిపూర్ణై కాంతనివాసముగా నుందురనియును తదర్థమై కుంటయొద్దున నొక వృక్షముక్రింద నొక శిలామయమగు చిన్న గది నొక దానిని నిర్మింపఁజేసికొని యందు వా రుందురనియును పది సంవత్సరములుగా వారు శ్రీవారిని సేవించుచున్నారనియును దెలియవచ్చినది.

ఈరీతిగా నాకు వారినిగూర్చి తెలిసినది. కొంత కాల మయినతరువాత వారు తమ పాత్రికతోఁగూడ కుంటకడ కేతెంచిరి. ఆయేకాగ్ర ప్రశాంతాకారము న న్నాకర్షించినది. అప్పుడు నాకడ నుండిన ఛాయారూపగ్రాహకయంత్రము (క్యామెరా)ను గైకొని, ఫోటో గైకొందును గాన నందుకుఁ దగురీతిని గూర్చుండవలయు నని వారిని బ్రార్థింప వా రందుల కియ్యకొనిరి. అంతియ కాక వారు నే నున్న కుటీరమునకు నా వెన్నంటి వచ్చిరి. అప్పుడు నాకుటీరముకడ నాకొలఁకుఁ గాఁచుకొనియున్న రిటయర్డుస్టేషన్‌మాస్టరుగా రుండిరి. వారి కింగ్లీషును తెలుఁగును బాగుగా తెలియును. వారిమూలమున యోగి రామయ్యగారి యభిప్రాయమును నేను కొంత యెఱుంగ వీ లయినది. యోగిరామయ్యగారికి సంభాషణ ములన్న సమావేశము లన్న నంతయిష్టము లేదు.

వారివయస్సు దాదాపు నలువది వత్సరము లుండును. నెల్లూరుజిల్లాలో వారికిఁ గొంత భూవసతి యున్నది. వారి కుటుంబమువారు దానిని నిర్వహింతురు. వీ రేమో యిక్కడ యోగసాధనవ్యగ్రు లై యుందురు. నెల్లూరునందు వీరికిని శిష్యమండలి యున్నది. ప్రతివత్సరము శ్రీవారికడఁ గొన్ని మాసములు సెలవు గైకొని వెళ్లి వారికడ రెండు మూఁడు మాసములప్రకారముగా నుందురు.

చిన్న ప్రాయమునాఁడు వారు దక్షిణహిందూదేశము నంతయును విరివిగా సంచరించి యోగసాధనార్థము గురువును

వెదకినారు. పలువురు గురువులను సేవించి కొన్ని సిద్ధులను సంపాదించినారు. ప్రాణాయామధ్యానధారణాదు లతనికి స్వాధీనపడినవి. వారివారికడ నుండిన విశేషముల నెఱింగికొని యిఁక వారికడఁ దాను సంపాదించుకొనవలసిన దేదియును గానరాకపోఁగా వీ రాయా గురువులను వీడి కడకు శ్రీభగవానుల సన్నిధికిఁ జేరుకొని ఈశ్రీవారే తమకు భవిష్యన్మార్గదర్శకు లని సేవకుఁ బూనుకొన్నారు. నేను వారి కొక యాంగ్లేయమాసపత్రికను జూప వా రందలి బొమ్మలను గాంచి యందొకదానినిగూర్చి వింతయయిన వ్యాఖ్యానము నిట్లు గావించిరి:—

"పాశ్చాత్యు లీయంత్రముల నభివృద్ధిపఱచు పద్ధతి నిల్పినచో అప్పుడుగాని వారికి నిక్కమయిన సంతస మేదియో తెలియఁబడదు. ప్రయాణములను శీఘ్రముగాను శీఘ్రతరముగాను నిర్వహించుసాధనములను గనిపెట్టఁ బ్రయత్నించుచున్నప్పుడు వారి కంతటితో సంతుష్టికల్గినదని మీరనగలరా?" అనివచియించి తా మిక్కడ రెండుమాసము లుండుటకుఁగాను వెంబడి నొక మనుష్యుని గొనివచ్చిన సంగతి తెల్పి పాశ్చాత్యుఁడనయిన నే నీ హిందూదేశమునందలి తాత్త్వికవిషయములయం దీరీతిగా మక్కువ గొనుచున్నందుల కానందించిరి. వారు నన్ను వదలిపోవులోపల వారు త్రాఁచుఁబాము నెడలఁ బ్రవర్తించిన రీతినిగూర్చి ప్రశ్నించితిని. అందులకు వారు హాసన్ముఖులై "మన మనస్సునందుఁ బ్రేమయుండి యసమానభావము

లేనప్పుడు భయము నేల చెంద వలయును" అని తెల్పిరి. వారు తెల్పినమాట లెంతయు భావగర్భితము లని నాకుఁ దోఁచినవి. వా రంతటఁ దమనివసనమునకు వెడలిరి. అప్పటిలో మఱి కొన్నాళ్లకు నా కాయోగి రామయ్యగారిని గూర్చి మఱికొన్ని సంగతులు తెలిసినవి. కుటీరము చెంతఁ గల చిన్న మైదానమునం దేమి కుంటకడ నేమి మేము పలుమాఱు కలసికొనువారము. వారి విశాలమయిన తేజోవద్దృష్టియుం దేకాగ్రత్వమును సంతృప్తియును గలవు. వారియందును దత్వవర్తనమునందును నా కెంతయు నికరమయిన గౌరవభావ ముదయించినది. వారితో నా కొక వింతయయిన నిశ్శబ్దమయిన స్నేహ మేర్పడినది. ఎట్టకేల కొకనాఁడు వారు నాతలయందుఁ గరంబున మెల్లగాఁ జఱచి యాశీర్వదించిరి. వీరు వ్రాయఁగా ఆముదుసలి స్టేషన్‌మాస్టరుగారు నాకు భాషాంతరీకరించి తెల్పినవి గాక నే నక్కడ నున్న కాల మంతటను నొక పర్యాయమయినను వీరితో నా కెట్టి వితమయిన సంభాషణయు జరగినది లేదు. కాని వారికిని నాకును దృఢమయిన స్నేహ మేర్పడి నట్లే నాకుఁ దోఁచినది. అప్పుడప్పుడు నేను వారితో నడవిలోని కేమి కొండచఱియపయిని కేమి వెడలుచుందును. కాని యెక్కడికి వెళ్లినను ఏమి చేసినను వారియొక్క ఏకాగ్రప్రశాంతభావములు వారిని వదలవు. ఆభావములనుబట్టియును ఆగాంభీర్యమునుబట్టియును వారియందు నా కేర్పడిన గౌరవభావము నన్ను వదలదు.

వారియొక్క యద్భుతమయిన శక్తి మఱియొక్కసారి నాకుఁ దెలియవచ్చుట కప్పటిలోనే మఱియొక యవకాశ మేర్పడినది. నాకప్పుడు మిక్కిలి చెడ్డ వార్త గల యొక యుత్తరము వచ్చియుండినది. దానివల్ల నే నిఁక ఈహిందూదేశమునం దుండుటను మాని వెడలిపోవలసినట్లు నాయార్థికపరిస్థితులవలనఁ దోఁచినది. ఈ శ్రీరమణాశ్రమమునందు శిష్యకోటి యెంత తెన్నాళ్లున్నను ఆదరణ కేలాటియాక్షేపము నుండదు. కాని ఆపద్ధతిగా నుండుటకు నా కేమాత్రము నిష్టముగాదు. ఏ మయినను కొన్ని పాశ్చాత్యసంస్థారీతుల యేర్పాటులవలన నాపరిస్థితు లప్పుడు సరిచేయఁబడినవి అందులకు నేను కృతజ్ఞుఁడను.

ఇట్టి పరిస్థితులలోనే యెవడయినను ప్రశాంతత్వసాధనము గావింపదగును. కాని నాకు మనస్థైర్యము చాలఁ గొంత యగుటంజేసి నేను అప్పటిలో మిగుల దిగులుపడియుంటి ననియే చెప్పవలయును. మామూలుగా శ్రీవారి ధ్యానము తొలగింపఁజేసికొను వాఁడ నానాఁ డాకూటము లోనికి వెళ్లి శ్రీవారిని దర్శించుకొని కొన్ని నిముసములు కాఁగానే యక్కడనుండి వెలిక్షువచ్చి నిలుకడ లేని మనముతో నా దురదృష్టమునుగూర్చి యాలోచించుకొనుచు నా కుటీరమునకు వెడలి కంబళిమీఁద నైరాశ్యముగాఁ గూలఁబడితిని. అదేమి విశేషమో కాని తలుపుచప్పు డయి నేనులిక్కిపడ వా

రెవరో లోనకు రావచ్చు నని యన్నంతట యోగి రామయ్య గారు మెల్లగా తలుపు దీసికొని లోన కేతెంచిరి నేను ససంభ్రమ ముగా లేఁచి వారు కూర్చుండఁగా గూర్చుంటిని.

వారు సంప్రశ్నకదృష్టితో నన్నుఁ గాంచిరి. వారి కింగ్లీషు రాదు. నాకు తెలుఁగు రాదు. నే నేరీతిగా అప్పుడు వారితో సంభాషింపఁగలను? ఏ మయినను గా నిష్మని మిక్కిలి సులభమయిన భాషతోను అభినయములతోను నాస్థితిని వారికి దెల్పితిని. ఆభాషణముయొక్క యర్థ మంతయును గాకపోయినను భావముమాత్రము వారి కవిగత మయియుం డును. ఆనా యభినయములయందు నైరాశ్యమును పరాభవ మును నిర్వేదమును నాపాలఁ బడియుండుటను దెల్పితిని.

వా రంతయు నాలకించి సానుభూతిగా శిరఃకంపము గావించిరి. కొంత సేపటికి వారు లేఁచి తమ వెంట రావలసిన దని నాకు చేసన్న గావించిరి. మే మొక చిట్టడవిలోని మార్గ మును బట్టితిమి. అది దాఁటఁగా పెద్ద మైదానము. అప్పటి యామాధ్యాహ్నికమార్తాండు నద్దూట కేమియును లేదు. వారి న ట్లొక యరగంటవఱకు వెంబడించితిని. అక్కడ నొక మఱ్ఱిచెట్టుక్రిందఁ గొంత కాలము విశ్రమించినతరువాత మఱి యొక యరగంట నడచితిమి. అప్పుడు మఱియొక్క చిట్టడవిని దాఁటి యొకకుంటకడకు వచ్చితిమి. రామయ్యగారు వచ్చిన రాకనుబట్టి చూడఁగా వారి కీత్రోవ యభ్యస్త మయియుండి నదిగానే కనుపట్టినది.

అక్కడ ఆయోగిగారొక పొట్టి చెట్టును జూచి దాని క్రిందఁ గూర్చుండఁగా నేనును వారి చెంత నిసుకలోఁ గూర్చుంటిని. అక్కడి తాళవృక్షచ్ఛాఖలు మాపయి గొడుగు వలె నేర్పడినవి. అక్కడ మేము మిక్కిలి యొంటరిగా నున్నట్లు తోఁచినది. మాకుఁ గొంత దవ్వునఁ గొన్ని గుట్టలు గలవు.

రామయ్యగారు యోగాసనమునఁ గూర్చుండి నన్ను నింకను తమనుసమీపింపవలసినదిగా సన్న గావించిరి. అప్పుడు వారి దృష్టి నీటివంక కేకాగ్రముగా బద్ధమై వారు ధ్యాన నిమగ్ను లయిరి. వారట్లే యేకాగ్రదృష్టితో ప్రశాంతముగా నెంతయో సేపు ధ్యాననిమగ్ను లై యుండిరి.

అప్పు డక్కడ నుండిన నైశ్శబ్ద్యమునకు అరీతిగానే ప్రశాంతుఁడుగా నుండిన ఆయోగిగారినిగూర్చియు నాకుఁ బ్రారంభమునం దెట్లెట్లో యయినది. కాని క్రమక్రమముగా నామనంబునందును నిలుకడ ప్రవేశింప సాఁగినది. ఇది యా యోగిగారివల్లనే యేర్పడిన దనుటకు సందియము లేదు. నామనస్సులోని చింత లన్నియు నడంగి స్థైర్యప్రశాంతత్వము లేర్పడినవి. ఏరీతిగా వారినుండి నాకీభావపరివర్తనము గల్గింపఁ బడినదో?

సాయంకాలము కావచ్చినది. దినము చల్లఁబడఁ జొచ్చినది. ఆనిశ్చలమయిన యోగి రామయ్యగారి శరీరయష్టి

సాయంకాలపు టెండ మెఱుంగులంజేసి బంగారు రంగు నొంది నది. నేను మరలఁ బ్రశాంతితరంగముల నోలలాడఁ బ్రారంభించితిని. అప్పుడు నాకు "నరుడు తనతనతనముయొక్క తేఁటఁదనమును విడనాడుకొని చిల్లరమల్లరలను లెక్కపెట్టు కొనుటంజేసి పలుసిలుగులు కలుగుచున్న వని నా కెఱుంగ నయినది. దైనస్వరూపమయిన యనుగ్రహము నాకు లభించు చుండఁగా లేనిపోని లౌక్యసంబంధమయిన చింతలను దెచ్చి పెట్టుకొన నేల యనియును నాకుఁ దోఁచినది. అందుకే గలి లియొ తన శిష్యులకుఁ బ్రకృతమునుగూర్చియే యాలోచింప వలసిన దనియును రేఁపటినిగూర్చి పరమాత్ముఁడు సరిచూచు కొను ననియును వక్కాణించియున్నాడు! పరమాత్ముని విశ్వ సింపఁ బ్రారంభించిన వాఁ డీలౌకికకష్టసుఖంబుల నప్పటినుండి లెక్క గొనఁ డని నా కప్పుడు తట్టినది. జీవితపరమావధిని జేరుట కెంతయు దవ్వు లే దనియు ఆ జీవితపరమావధి నెఱిం గినచో మనంబు నీలేనిపోని గొడవ లన్నియును విడనాఁడగల వనియును నాకుఁ దోఁచినవి. ఈరీతిగానే తదాధ్యాత్మికపరి క్రమణమునంజేసి నామనసునం దుండిన వంతలన్నియు నంతు నొందినవి.. ఈయనుభవమునంజేసి యప్పుడు కడచిన కాలపరి మితి నాకు లెక్కకు రా లేదు. పరమాత్ముఁడు తనలోనే యుండు ననియును నతఁడు నిర్లిప్తుఁ డనియును నేరీతిగాఁ జెల్ప వీల గునో నా కెఱుంగ రాదు. అప్పుడు చీఁకట్లు గ్రమ్మ సాఁగినవి. భూమధ్యరేఖకు సమీపమున నుండు నీప్రదేశములయందుఁ

చీఁకట్లు త్వరగాఁ గ్రమ్ము నని యెప్పుడో యెక్కడనో వినినట్లు నాకు జ్ఞప్తిఅయినను నే నావిషయమును లెక్కింప నవసరముగా తోఁపలేదు. ఎందు కనఁగా నా చెంతనున్న మహనీయుఁడే నాకు సర్వరీతుల మార్గదర్శకుఁ డనియును అతనినుండి నాకు ప్రశాంతత్వలాభము కల్గు ననియును ధైర్యము నాకుండినది.

చీఁకట్లు దట్టముగా వ్యాపించినవి. అప్పుడు ఇఁక లేవ వలయు నని సూచనగా యోగిగారు మెల్లగా నన్నుఁ దాఁకిరి. కరావలంబనమున మే మిరువురమును ఆగాఢాంధకారమయమయిన నిర్జనమార్గమున నడచితిమి. దీపమా? లేదు. త్రోవయా? కాన రాదు. కాని మార్గదర్శకం బేది? యోగి రామయ్యగారి యనుభూతియే. వారి నవలంబించుటయే. ఇప్పుడు గాక మ ఱెప్పుడయిన నిట్టి కీకారణ్యంబునఁ జీఁకటియు నేకాంతముగా సంచరించుచో నాహృదయము మిక్కిలి భయవిహ్వల మయ్యెడిదే. నే నప్పుడప్పు డాప్రాంతములయందు నొక మనుష్యుని నతని కుక్కను గాంచెడి వాఁడను. ఒక చిఱుతపులి వానిని మెడమీఁద గాయపఱచి వాని కుక్క నెత్తుకొని పోయినది. అట్టి కథ లిప్పుడు నే నొంటరిగా నిక్కడఁ దిరుగవలసి వచ్చినచో జ్ఞప్తికి వచ్చియుండును. ఇప్పుడుగూడ ఏచిఱుతపులి యెదురగునో, ఏపాము ద్రొక్కుదునో, ఏ తేలు పయి నంగ వైతునో యను ననుమానములు నామానసమునఁ బొడకట్టుట మానలేదు. కాని యంతలో నే, మహనీయులయిన

యోగిగారి వెంబడి వెళ్లునప్పు డిట్టి భావనల నొందఁ దగ దని సిగ్గు నొందితిని.

హిందూదేశమునందలి ప్రాతరారంభ మెట్లు వింత యయినదో రాత్ర్యారంభమును నట్టిదే. అప్పుడప్పుడు నక్కల యూళలు విన నయ్యెడిని. అప్పుడప్పు డేదియో దుష్టజంతువు యొక్క గాండ్రింపుసయితము నాలకింప నయ్యెడిని. ఇంతలో నాశ్రమమును సమీపించితిమి. కుంటలోని కప్పల యారావములును తోఁటలోని ఝిల్లికారావములును గిజిగాడుల యార్పులును విననయ్యెడిని...... తెల్లవాఱినతరువాత నా మనంబున నింత తేలికఁదనముతో మేల్కొంటిని.

నాచుట్టుపట్లఁ గల ప్రకృతిని వర్ణింప నాకభిలాషయగు చున్నది. శ్రీవారితో నాకు జరగిన సంభాషణలనుసయితము వ్రాయ నిచ్చగానే యున్నది. కాని యొక విధమయిన యుప సంహారముగా కొన్ని సంగతులు ముచ్చటించెదను.

మహర్షిగారినిగూర్చి నే నెంతయు నాలోచింపఁగా వా రతిపూర్వకాలపు వారివలెఁ గన్పట్టుదురు. నేఁడు ఒక బంగారు గనిం గనుంగొన్న నెంత మెచ్చు గల్గునో ఆపూర్వకాలమున ఆధ్యాత్మజ్ఞానలాభమున కట్టి మెచ్చుండినది. ఆలోచింపఁగా నాలోచింపఁగా దక్షిణపుటిండియాలోని యీ మాఱుమూల ప్రదేశమున హిందూదేశపుఁ దొంటి యాధ్యాత్మికదేవతా స్వరూపముగలవాని నొకని నేను జేరుకొన్నట్లు నాకుఁదోచినది.

ఈమహనీయునిపవిత్రస్వరూపాచరణలంజేసి హిందూదేశము నందలి మహానుభావులయిన తొంటి మహర్షులయొక్క రీతి నా కవగత మగుచున్నయది. వీరు తమ మహత్త్వమును మఱుఁగు పఱచియుండుట యాలోచించి చూచువారి కర్థ మగును. అగాధతమంబయిన తదంతరాత్మ నిర్మలజ్ఞానసంభరితం బని తోఁచుచు నన్ను ముగ్ధునిఁ గావించుచున్నది కొండొక సమయ మున వారు మన కెంతయు సంబంధింపని వారుగా నగుపట్టు దురు. కొండొక సమయమున నత్యంతాదరణమునఁ దమతోఁ మన హృదయంబుల దృఢంబుగా నాయసపాశంబులతోఁ బోలెఁ గట్టివైచుకొందురు. వారిచే నే నీరీతిగా సాయము నొందవలసినది నా కవగత మగుచున్నట్లు తోఁచెడిని. వారు సామాన్యప్రపంచరీతులకు దవ్వుగా నుందు రన్నచో వారి ప్రకృతివలన అంతరాంతరస్థంబయిన యాత్మసాధనం బని యర సిన వారు వారి నంగీకరింపకపోదురా? వారియొక్క తేఁటదన మును వినయమును మర్యాదయును మిక్కిలి నాకు నచ్చినవి. సామాన్యముగా విద్యలోనో మఱి దేనిలోనో యధికులుగా నుండు వారు గర్వితులై యుందురు. వీరిలో నట్టి రీతి లేనే లేదు. సామాన్యముగాఁ గొందఱు కనుపఱచునట్టి సిద్ధుల గారడీని వీరు కనుపఱచియుండినచో తమ చెంతఁ గల జనుల నంతకన్న నెన్ని రెట్లో యెక్కువగా నాకర్షించి యుండెడివారు. లేనిపోని చిల్లర మహత్త్వములను జూపి ప్రజలను వ్యాము గ్ధులను గావించుట యతనికి సమ్మతము కాదు. ఈవారి పద్ధతి

న న్నెంతయు భక్తిముగ్ధునిం గావించినది. శ్రీవారివంటివారి సన్నిధిలో నున్నచో నావంటివారి స్వభావము ఆత్మకు దవ్వు దవ్వులుగా నుండు ప్రాపంచికవిషయములయం దనిష్టత నొంది క్రమక్రమముగా నాత్మను సమీపించునట్టి వెనుకమార్గము పట్టునట్లు తోఁచెడిని. అట్టి మహనీయులగు ఋషీశ్వరులు చెప్పిన దేదో మనవంటివారు గ్రహించుకొనవలసినదే కాని వారితో వట్టి కారువాదములను బెంచుకొన రా దనియును నాయభిప్రాయము. వారి స్వభావమునుబట్టి వారి యాచరణనుబట్టి చూచినచో, శ్రీరమణులవారియొక్క బోధలు నాకు మిగుల నచ్చుచున్నయవి. వారి పద్ధతిలో అవి సరిపడియే యున్నవి. ఏదియో మానవాతీతమగు శక్తిని గనుపఱచి యామహనీయుఁడు దానియందు గ్రుడ్డినమ్మకము వహింపుఁడని కోరఁడు. వారి యాధ్యాత్మికానుభవమును ఆత్మజ్ఞానబోధను ననుభవించినచో ఆత్మానుభవ మనుభవమునకు వచ్చుచున్నట్లు తోఁచును. దేవుఁ డను పేరునుగూడ వా రంతగా నుచ్చరింపరు. నిగూఢార్థములు చర్చోపచర్చలు వారి కిష్టము గావు. అట్టి వానివల్లఁ గావ్యసాఫల్యము కష్టము. వారు తెలుపున దెల్ల ఆత్మజ్ఞానము. దానిని ప్రాతదిగాని క్రొత్తదిగాని అయిన యేపద్ధతిచేత నేనియును సాధింపఁ బ్రయత్నింపవచ్చును. మొత్తమునకు తన్నుఁ దా నారయఁజాలిన యేమార్గమయినను వారికి సమ్మతమే.

తన్నుఁ దా నెఱుంగు ప్రయత్నమున నిజమయిన యాథార్థ్యాత్మికలాభము ఏర్పడఁగల దని నాయభ్యాసపూర్వక మయిన విశ్వాసము. శ్రీభగవానులవారికిని నాకును సంభాషణములు లేకుండినను వారినుండి పలుమాఱు నాలోనికి శక్తి ప్రవహించుటను నేను గమనించుచుందును.

నే నిక్కడినుండి వెళ్లవలసినట్లు నా కెన్నియో సారులు తోఁచుచుండునుగాని యప్పటికప్పుడు ఏమంత యవసరమని ఆప్రయత్నమును వారించుకొనుచుందును. ఏయవసరముచేత నే నిక్కడికిఁ బరుగెత్తివచ్చితినో దానినిబట్టియే,ఆయవసరము నెఱవేఱుపొందెనే నాకు నాశరీరపుస్వస్థతగాని మెదడు నలసట గాని యీదేశపు వేఁడిమిగాని లెక్కకు వచ్చుట లేదు. కాని యెంతయయినను ప్రకృతిని జయింప సాధ్య మగునా ? త్వరలో నే శరీరమున కేదో ప్రాతికూల్యము కల్గున ట్లున్నది. మానసికము నా కెంతటి సౌఖ్యమును ఇక్కడ చేకూరుచున్నదో దానికి వ్యతిరేకముగా శారీరకముగా అంతటి యసౌఖ్యము ఇతఃపూర్వాననుభూతము కల్గుచున్నయది. ఒకట నాకు చలి జ్వర మేర్పడినది.

శ్రీమదరుణాచలదేవాలయాంతర్భాగముల . నొక నాఁడు గాంచివచ్చి శ్రీమహర్షిగారి కూటములోనికి వెడలి కూర్చుండి ధ్యానసమాధి నూనితిని. త్వరలోనే నామనస్సులో నటునిటుపరుగిడుచుండినభావములు నిలుకడకువచ్చినవి.కన్నులు మూసికొనఁగా అంతరాత్మ యనుభవమునకు వచ్చినట్లయినది.

శ్రీమహర్షులవా రాసీనులయియున్నట్లు మన్మనోనేత్ర మునకు గోచరించుచున్నారు. వారి బోధల ననుసరించి రూప హీనమయిన యాత్మ నెఱుంగఁ బ్రయత్నింతును. నాకు వారి యాత్మతో సంబంధ మేర్పడి వారి రూపము మాయమగును. దానంజేసి మదాత్మజ్ఞానము దృఢతర మగును.

ఈధ్యానము నభ్యసింపఁ బ్రారంభసమయములయందు నాకుఁ గల్గుచుండిన సందేహము లన్నియును ఇటీవల తగ్గిపోవ సాఁగినవి నామనస్సాక్షికి సంబంధించిన దైహిక మానసికాది భావముల నీయాత్మాన్వేషణసందర్భమునఁ ద్రోసిరా జన్నాను. అటుపిమ్మట నాయందలి యంతరాంతరమునసుండు ఆత్మకై యన్వేషణము ప్రారంభ మగుచున్నయది. అటుపిమ్మట అత్యం. తోన్నతావస్థ యేర్పడును ఆనిశ్చలత్వమునందు మనస్సునకు ఆత్మసాక్షాత్కార మేర్పడి యీబహిఃప్రపంచ మంతయు నీడ వలెఁ దోఁపసాఁగును. ఒక నిమిషము సర్వం నాస్తి యనియుఁ దోఁచెడిని. అట్టి సమయమునం దేకాగ్రత్వమును నిల్పుట మిక్కిలి కష్టసాధ్యము. బహిర్వ్యాపారములనుండి మనంబును లాగుకొని యట్టి యేకాగ్రత్వమునకుఁ గైకొనిపోవుట మిక్కిలి కష్టముగదా?

ఈరాత్రియే నాకీయభిప్రాయము తట్టినది. నాలో నొక నవీనశక్తి మిక్కిలి సత్త్వముతోఁ బని చేయఁ బ్రారంభించి నన్ను త్వరగా నాలోనియంతరాంతరములకుఁ గొని పోసాఁగి

నది. ఈరీతిగా యుద్ధమువంటి దయిన మొదటి చిక్కు గడచి నెమ్మది యేర్పడినది.

రెండవ స్థాయిలో నేను బుద్ధితోను ఐహికసంబంధములతోను సంబంధింపఁ జేసికొనక భిన్నపడుదును. అయినను ఆబోధకసూత్రముమాత్రము నాలో పని చేయుచుండును. ఈ లేనిపోని భావనలతో నాసంబంధము వదలుచుండుటయు నేను గనిపెట్టుచున్నాను. ఇదివఱకు గర్వపడుటకుమాత్రముపయోగపడుచుండిన యాలోచనశక్తివల్లనే నా కీబహిర్వ్యాపారములనుండి విడుదలయేర్పడుచున్నయది. ఆయాలోచనశక్తి నన్ను వీఁడినట్లు నాకు తెల్లమగుచున్నది. అప్పుడు దానినిగూడఁ దప్పించుకొని దానిని గడచి యింకను లోనికి నేఁగవలయు ననునిచ్ఛ పొడముచున్నది. మిక్కిలి శ్రద్ధతోను మెలఁకువతోను ఈనా మెదడుయొక్క సంబంధమునుండియే తప్పుకొన్నచో ఏరీతిగా నుండునో సానుభవముగాఁ దెలిసికొన నాకుఁ గోర్కి గల్గుచున్నయది.

ఈనా మెదడు నాది కాదు మఱి యొకరి దనుకొని దానిప్రవర్తనల నన్నింటిని గమనించుచు భావన లెట్లు పుట్టి మగుడునో తెలిసికొనుట మిక్కిలి వింతయయిన పనియే. కాని, ఆత్మలోని యంతరాంతరమునకుఁ బ్రవేశించుట యంతకంటె వింతగా నుండును. క్రొత్త ఖండమును గనిపెట్టిన కొలంబసువంటి వాఁడను నేనయినట్లు నాకుఁ దోఁచినది. లేని

పోని భయకారణములను జూపు నాలోచనల నంతట నేను వదలివేసితిని. దానంజేసి నిశ్శబ్దముగా నుప్పతిల్లు భయంబు లన్నియు నడంగుచున్నవి.

కాని పుట్టుకనుండియును బట్టుకొనివచ్చుచున్న భావనల నుండి యొకండు విడివడుట యెట్లు? ఆలోచనపరంపరల నాప వలసిన దని శ్రీవారు చెప్పినట్లు నాకు జ్ఞాపకము లేదు. "ఆలో చన ప్రారంభస్థాన మేదియో యక్కడి కాలోచనను గొని పొమ్ము, ఆత్మ యెట్లెలుకపడునో గమనింపుము. అప్పుడు నీభా వన లన్నియును తమకు తామే యడఁగిపోవును." అని భగ వానులవారి బోధ. అని నే నా నా భావనోదయస్థానమును గనిపెట్టినానని తలంచి నాయాలోచన నీస్థానమునకుఁ దీసికొని వచ్చిన శక్తిని వదలివైచి సంపూర్ణనిరంజనత్వము నొంది యొక పాము తన వధ్యజంతువునుగూర్చి జాగరూకమైన తెలివిగున నుండును.

ఈస్థితి శ్రీవారు తెల్పిన పరిస్థితి యేర్పడువఱకు నుం చును. భావనాతరంగములు క్రమముగా నంతరింపఁ దొడఁ గును. కారణాలోచనపద్ధతియు బొత్తుగా నడంగి పోవును. నాయనుభవములోని యొకవింతయయిన భావన నన్నిప్పు డాక్రమించినది. కాలముగ గడచుకొలఁది నే నాయజ్ఞేయ పదార్థమును జేరఁబోయెడునట్లు తోఁచెడిని. కర్మేంద్రియ వ్యాపారములు కానవచ్చుట లేదు. వాని జ్ఞప్తియేనియు

వాని జ్ఞానమేనియు మఱుమాయమయినవి. ఈవస్తువులనుండి నేను వెలివడ నున్నట్లు తోఁచెడిని. ప్రపంచరహస్య మింతలో గాన్పింపఁ బోవున ట్లున్నది.

కడపటి అయ్యది యేర్పడుచున్నది. ఆర్పఁబడిన మైనపు వత్తివలె భావనాకళిక యడఁగినది. బుద్ధి తనయొక్క నిక్కమయిన చోటునకుఁ జేరుకొనియెడిని. అనఁగా మనస్సాక్షిప్రవర్తనములకు భావనలయొక్క యడ్డు లేదు. నాకు అనుమానమే మని కల్గినదో శ్రీమహర్షిగారే మని యానతిచ్చియుండిరో యారీతిగానే నాయొక్క హృదయమొక్క యమేయస్థాయి కెక్కుచున్నది. గాఢనిద్రలోవలె మెదడు పూర్తిగా సెలవు పుచ్చుకొన్నది. మిక్కిలి ప్రశాంతముగా నేనెవరయినదియు ఏమి జరగుచున్నదియును నేను జాగ్రత్తగాఁ గనిపెట్టుచున్నాను. నేనొక ప్రత్యేకినను రీతినుండి నా తలంపింకను క్రేవకు లాగఁబడుచునే యున్నది. ఆబుద్ధి సర్వాత్మకవ్యాప్తి నొందుచున్నయది. అహా మనునది యింకను నున్నది కాని అది మార్పుఁ జెంది తేజోమయమయినది. ఎందు కనఁగా ఈశరీరమునకన్న భిన్నముగాను అంతస్స్థముగాను దైవమయముగాను నుండిన సాక్షిభూతవస్తువే ఇప్పుడు "నే" నగుచున్నది. దానితోడనే యొక యద్భుతమయిన స్వేచ్ఛాలాభము వ్యక్తమగుచున్నయది. ఈభావనాపరంపరవలన మనం బిక్కడికి నక్కడికిఁ బరుగు లెత్తుచుండును. ఆ పరంపరనుండి మనస్సు విడివడుట చెఱసాలనుండి విడివడి స్వేచ్ఛ నందినట్లే యుండును.

లోకముయొక్క పరిస్థితి కవ్వాల నున్నట్లు నాకు తోఁచుచున్నది. ఇంతవఱకు నాపయినెనున్న పట్టు అంతరించినట్లే నేనొకానొక తేజోమహాసముద్రము మధ్యమునఁ బ్రవేశించినాను. లోకసృష్టికి మూలకారణవస్తువేదో నాకు గోచరించినట్లేయయినది. అది యఖండముగాను అనంతముగాను జీవమయముగాను అనిర్వాచ్యముగాను నున్నది.

ఈవిశ్వమహానాటక మాకాశరంగంబునందుఁ జెలంగుచుండఁగా నొక మెఱుపు దీపపు సాహాయ్యమున (ఒకానొక దివ్యదృష్టిమూలమున) అయ్యది నాకుఁ బోడకట్టిన ట్టయినది. ఆస్థాయినుండి నారీతికి నేను జేరుకొనుటయును జరగినది. నేనిప్పుడు క్రొత్త వాఁడనై పవిత్రానందమాతయొక్క యంకమున నత్తమిల్లిన ట్లయినది. ఈయానందామృతపానమునం జేసి నిన్నఁటి చెడుగుల జ్ఞప్తియును తేఁపటి ప్రాతికూల్యముల కలవరమును నానుండి పూర్తిగాఁ దొలఁగినవి. నాకు దేవమయమయిన స్వేచ్ఛాశక్తులు లభించినవి. సృష్టియం దంతయును నాకు సంపూర్ణమయిన సానుభూతి కల్గుచున్నది. అందులకుఁ గారణ మేమందురా? సర్వము నెఱుంగుట యనఁగా ఎల్లరిని క్షమింప నెఱుంగుట గాదు. ఎల్లరిని ప్రేమింపవలయు ననునది నాకుఁ దెల్ల మయినది. నాహృదయారవిందం బమందానందకందళితం బయినది.

ఈయనుభవముల నన్నిటిని వ్రాసి తెలుపుట చాల కష్టము గదా? అయినను ఐహికభాషకు సాధ్యమయినట్లుగా

నేతద్విషయములను వ్రాయుచున్నాను. జ్ఞప్తి నాధారము చేసికొని యతిప్రయత్నముతో హృదయమునకు వెనుకను వ్యాపించియున్న వింతయయిన లోకమున మదనుభూతిని యథాసాధ్యముగాఁ దెల్పుచున్నాఁడను.

నరునికి గొప్ప బంధువున్నాఁడు. తల్లికన్న నొక గొప్పవస్తు వతనిని వృద్ధికిఁ దెచ్చినది.

పూర్వ మొకానొకప్పుడు నరుఁడు ఒకగొప్ప ప్రతిజ్ఞ గొని దేవమయతేజస్సుతో దేవతలతో సంచరించినాఁడు. నేఁటి కాలమున అతఁడు ఐహికావసరములయందుఁ బాల్గొన్నను అతని ప్రతిజ్ఞను మఱువనివా రున్నారు. సకాలమున తన కర్తవ్య మతనికి జ్ఞాపకమునకు వచ్చును.

అవినశ్వరజాతికిఁ జెందిన నరునియందుఁ బరతత్త్వము కలదు. ఆనరుఁడు తనను దాను జాలవఱకు మఱచిపోవును. కాని ఆమఱపువలన నతనిలోని పరతత్త్వమున కేమాలిన్య మును నంటదు. దాని గొప్పతన మేమాత్రమును తగ్గదు. అతఁడు పంచేంద్రియవశుండై దానిని మఱచి పోవచ్చును. అయినప్పటికిని దాని యాహ్వానము వచ్చిన సమయమునందు తా నెవ్వఁడో యతఁ డెఱింగి యాత్మను జెందును.

తన దేవతాభావము మాటుపడిన కారణమున నరునికిఁ దనపైఁ దనకు విశ్వాసము లేదు. అందువల్ల నతఁడు అభిప్రాయ ములకొఱ కితరులకడకు వెడలును. కాని మిక్కిలి నిశ్చయ

మయినయభిప్రాయ మతనికి తనలోనే లభింపఁగలదు. జ్ఞాన దృష్టి యీయైహికమునుగూర్చి యుండదు. అది యాంతర్ముఖము గానే యుండును. దాని వికాసము తన్నుఁ దా నెఱుంగుటయే.

తన్నుఁ దా నరసికొనఁ బ్రారంభించినవానికిఁ దొలుత అసంతృప్తి అజ్ఞానము భీతి మొదలయినవి గానవచ్చినప్పు డతఁ డీపద్ధతిపైన విశ్వాసము నొందరాదు. అతఁ డాయంతర్దృష్టితో నింకను అగాధముగా చాలకాలమువఱకుఁ గాంచవలయును. ఆరీతిగా నతఁడు తన మనంబు స్థిరపడువఱకును అంత తేఁట గాని రీతులుగా ఉచ్ఛ్వాసములఁ బోలు సూచన లగుపడువఱ కును గావింపవలయును. వానిని జక్కగా గమనించినచో అవియే చక్కని యాలోచనలుగా నేర్పడి మనస్సుయొక్క గడపను దాఁటఁ జేయఁగలవు. అటుపిమ్మట వీని సాయమున నే యొక నాదము విన నగును. అది యనవద్యంబయి చిత్రముగా నుండును. అదియే యొకాయొకనియొక్క యంతరాత్మకు సంబంధించినది.

ఈపరమార్థతత్త్వ మనునది యెవ్వరిలో నయినను వికాసము నొందును. కాని దానినిగూర్చి లక్ష్యపెట్టక సంచ రించినచో అది యనుభవమునకు రాదు. ప్రతివ్యక్తికిని ఈ పరమాత్మాంతరంగికత్వము తప్పక యున్నది. మనుజుఁడే దా నిని గమనించుట లేదు. జనులు ఏదో పద్ధతిప్రకార మొకా నొక విధమయిన నటనగా జీవితముయొక్క స్వభావవైచిత్రి విమర్శనము గావించుచుందురు. ఓనరుఁడా! నీజన్మకుఁ గారణం

బయిన జీవశక్తి నీయొక్క యంతరంతరభిప్రాయమునకన్న మహనీయమయినదియును గౌరవార్హమయినదియును నీవిషయమున నది యొసంగు సత్సందేశమును విశ్వసింపుము. అది వ్యక్తావ్యక్తముగా నీమనంబునకు గావించు సద్బోధలనుగూర్చి శ్రద్ధ గైకొనుము.

తనయొక్క నిజమయినకర్తవ్యమునుగూర్చి శ్రద్ధగైకొనక యెవఁడు తన జీవితము ననాలోచితమయిన కోరికలప్రకారము గడపునో అట్టి జీవితము స్వప్నప్రాయ మగును. తనతోడి జీవులయెడలఁగాని తనయెడలఁగాని యపచారము గావించినవాఁ డాత్మహత్య గావించుకొన్నట్లే. మనుజమాత్రులతని పాపముల నెఱుంగ కుందురుగాక. సర్వము నెఱుంగంగల దేవతల కనుల నాతఁడు మాయఁగలఁడా? ఇప్పటికిని న్యాయ మనునది లోకమును చక్కగా పరిపాలించుచున్నది. అయ్యది లాకోర్టు లనఁబడియెడి హాతి కట్టడములలోఁ గానరాక పోయినప్పటికిని దానియొక్క యనేకములయిన చర్యలు అదృశ్యముగా జరగుచునే యుండును. ఈభూమియందు నెవరేనియు న్యాయప్రకార మనుభవింపవలసిన శిక్షలను దప్పించుకొందురుగాక. కాని వారు దేవతలు విధించున్యాయ శిక్షలనుండి తప్పించుకొనఁజాలరు. సంగతి యిట్లుండఁగా నరులకు దయయును నిలుకడయును తక్కువగా నున్నవి.

దుఃఖవిషమయమహాసముద్రములో మునింగి, యోడికలు గట్టు కన్నీటఁ గన్నులు గాన రాక ప్రాకులాడువారికి సులభ

ముగా సత్యముయొక్క నిశ్శబ్దమయిన వాణి విన నగును. సుఖకాలమునందు సౌఖ్యములే నంతగా లెక్కింపని వారి కాపదలు వచ్చినప్పుడు వానిచే నంతగా బాధకల్గదు. ప్రతి జీవితమునందును సుఖమును దుఃఖమును తప్పక యుండును. కాఁబట్టి యెవ్వఁడయినను గర్వపడుటయును ఇతరులయెడ నౌదాసీన్యము వహించుటయుఁ దగదు. అట్లు గావించినవాఁడు మిక్కిలి విషమయిన విపత్తు నొందును. అదృశ్యమానులుగా నుండు దేవతల సన్నిధిలో ధరించుకొనవలసిన యాభరణ శ్రేష్ఠము దయయే. ఈయలంకారము వారికి నబ్బినదయి వా రనుగ్రహించి యనేకకాలముఁయొక్క పాపంబులను బాప వచ్చును. ఎల్లవారికిఁ గష్టసుఖములు పర్యాయముగా వచ్చుచుఁ బోవుచు నుండును. కాని గమనింపని వారి కారీతి తెలియఁ బడదు. విశ్వమునకుఁగూడ సృష్టివిలయములు పర్యాయక్రమ మునఁ గల్గుచుండును గదా? సిరిసంపదలు గలవానికి ఆరో గ్యము తక్కువగా నుండవచ్చును. మానసికమయిన తొం దఱ లుండవచ్చును. అప్పుడు ప్రేమసంచార మేర్పడవచ్చును. ఈమనోదుఃఖము గడచినతరువాత నవీనజ్ఞానకాంతులు గాన నగును. ఈవిషయము లన్నిటినుండియుఁ గడపటఁ దెలియఁ బడునది నరునిలోనే యతనియొక్క సంపూర్ణమగు రక్షణకాని దాని నెఱుఁగరు. దానికై ప్రయత్నింపరు. ఏ మయినను గా నిమ్ము. అతని యేకాకిత్వమో యాశాభంగమో యేదియో దాని నతఁడు కనుగొనునట్లు చేయును. ఈచిక్కులు లేక

దైవానుగ్రహమువలన జ్ఞానలాభము నొందినవాఁడే లోకమునందు గొప్ప యదృష్టవంతుఁడు. పరతత్త్వము నెఱింగి దాని రక్షణము నొందినవానికే క్షేమమును రక్షణయును భద్రమును గలవు. ఈజ్ఞానతేజంబును గాంచుటకు అశ్రద్ధను బూనువానికి వాని తెల్వితేటలే యాపదకు గొప్పకారణములగును. వాఁడీప్రాపంచికముగా సంపాదించుకొను నొక్కొక విషయమును సతనికి బంధముగా నేర్పడును. దానినుండి యాతఁడటుపిమ్మట విడిపించుకొనవలెను. ఇట్టివానికీబంధములసంఖ్య యెక్కువ. పురాతనకర్మానుబంధము నరునకుఁ దప్పక యున్నది. దాని యనుభవ మంతయును ఆత్మసాక్షిగానే జరగుచున్నది. ఆయాత్మ తనలోనే యున్నది. దాని నక్కడ లేకుండఁ జేయు టెట్లు? కాఁబట్టి నరుఁ డీవిషయమునుగూర్చి యజ్ఞాని గాక తన్నుఁ దాఁ దరింపఁ జేసికొనవలయును. అప్పుడతని ప్రాపంచికసంబంధములును అతని చిక్కులును ఆయాత్మ వలన నెక్కువ తేలికపడి తప్పక జయప్రదము లగును. ప్రశాంతజీవితమును నిర్భయమయిన మరణమును గావలసినవారిట్లే చేయవలయును.

తన్నుఁ దా నెఱింగినవాఁ డితరుల నసహ్యించుకొనఁడు. ఒకరిపయి నసహ్యపడుటకన్న గొప్ప పాతకము లేదు. రక్తపాతమువలన నేలను సంపాదించుకొనఁ దప్పక వీలగును. దానికన్న గొప్ప దుఃఖము లేదు. చేసిన పని యనుభవమునకు వచ్చు ననుటకన్నఁ జక్కఁగాఁ జూప వీలయిన ఫలితమును లేదు.

మన దుండగముల నొక వేళ సాటి నరులు చూడఁజాలక పోయినను దేవతలు సాక్షిభూతులుగా నుండి చూడఁగలరు. చుట్టుకొన్న దంతయును దుఃఖమయప్రపంచము. కాని యఖండమగు ప్రశాంతి యందఱకుఁ జేతిలోనే యున్నది. దుఃఖము చేతను అనుమానములచేతను బాధ నొందిన నరులు జీవితము నింకను దుఃఖమయమయిన త్రోవల మెట్టుదురు. కాని వారి యెదుటనే యొక గొప్పతేజంబు తాండవించుచున్నది. ఏనాఁడు జనుఁడు తన సాటి వారలను చర్మమయదృక్కులతోఁ గాక యాత్మదృష్టితోఁ జూడఁ గల్గునో యానాఁ డాతనిలోని యసహ్యభావ మాతనిని వీఁడును. అప్పుడు అందఱిలోను పరమాత్ముఁడు వెలుంగుచున్నాఁడను జ్ఞాన మతనికిఁ గల్గి యందఱిని గౌరవముతోను ప్రేమతోను జూడఁగల్గును.

ప్రకృతియొక్క నిజమయిన గొప్పతనమును కళయొక్క నిక్కమయిన యందమును తన్నుఁ దా నెఱింగినవాఁడే యూరయఁగలఁడు. ప్రవక్తచేత బోధింప వీలుగానినాఁడు కళాయుక్తుఁడు తనలోని దైవమహిమవలన నేర్పడిన కళామూలకముగా సందేశమును బోధింపఁ గల్గుచున్నాఁడు. లోకవిషయమునంజేసి లేనిపోని బెడదలు గల్గి మనంబు పాడయినప్పుడు కళారాధకుఁడు దైవమయమయిన తన కళతో నానందించును. దాని నెవ్వరును గాదనఁజాలరు. దానియం దతని మదికిఁ బ్రశాంతి కల్గును. తనను దా నెఱింగినప్పుడే నరునికి నిజముగా ప్రశాంతియయినను బలమయినను ఉత్సాహమయి

నను తేజస్సయినను జ్ఞానమయినను ఏపాటిగాఁ నేని కల్గఁ గలదు. ఈసంగతిని దృఢముగా నమ్మవలయును. విద్యావంతులు గ్రంథంబుల నన్నింటి నారసి సంపాదించుకొన వలసిన జ్ఞానమును దీనికన్న నితరము కాదు. ఈయాత్మ జ్ఞానసంపాదనమునకన్న మఱి యొక్క సత్యము నెఱుంగుట, యన్నదియు నుండదు. ఈయాత్మజ్ఞానము దైవమయము. జీవితకాలమునందు నరునియొక్క యెన్నో చిల్లరయాసలు నెఱవేఱక యడియాస లగునుగాక. కాని ఈయాత్మ జ్ఞానము—ఈయవినశ్వరవస్తువు— ఈనిర్మలప్రేమ—ఈయఖండానందము— అనునవి యతనికిఁ గడపటను దప్పక లభింపఁగలవు. ఎందు కందురా? ఇది తప్పనిసరిగా నేర్పడు పరమావధి.

మహనీయుల కీలోకమతనయొక్క మనోహరభావముల తోను గొప్పపద్ధతులతోను గానవచ్చును గాని దాని చారిత్రకలోపములు లెక్కకు రావు కాని నరుని కాత్మ నారసికొను వీలుగల్గినప్పు డతఁడు పరవశుఁ డగును. అప్పుడే యతనికి సరియయిన భావనలు సులభముగా నేర్పడఁగలవు. అప్పు డతని మనస్సు మతప్రవర్తలయొక్క [హిబ్రు-ఆరబ్-మొదలయిన వారియొక్క] హృదయముం బోలి మిక్కలి యున్నతమయిన బోధలఁ దెల్పఁగలదు. ఈతేజంబునందియే బుద్ధభగవానులు జగంబునకు నిర్వాణసందేశంబును బోధింపఁగల్గినారు. ఈజ్ఞానమువల్లనే విశ్వప్రేమ యేర్పడును. ఏసుక్రీస్తుని సన్నిధియం

దీజ్ఞానమును తా నందినప్పుడే "మగడలీన్" తన జీవిత మంత యును ఖిన్న రీతిగా వ్యర్థపుచ్చినందులకు రోదనము గావించుట జరగినది. ఈసనాతనమయిన సత్యములు నిర్మలము లయినవి. ఇవి యెన్నియుగములుగా వచ్చుచున్న వనుమాటతో, నవసరము లేదు. ప్రతిమనుష్యునికి జ్ఞానసాధనము చేతిలోనే యున్నది. ఇది యసాధ్యముగా నున్నవాఁ డెవ్వఁడును లేఁడు. ఈ యంతర్జీవితము నవలంబించినవారికి ఈ సత్యంబు లన్నియును నక్షత్రంబులవలె వారివారి భావనాకాశంబులయందు వెలుంగుచు వారియొక్క పరమార్థోద్యమమును బెంచును.

అప్పు డేదో యజేయమయిన శక్తివలన నా కైహిక జ్ఞానము కల్గినది. క్రమేణ నాకు మెలఁకువ వచ్చినది. ఆకూటములో భగవానులవారుగాని మఱెవరుగాని లేరు. వారు రాత్రి భోజనార్థము వెళ్లియుందు రని తలంచినాను. ఆడెబ్బదియయిదేండ్ల స్టేషన్‌మాస్టరుగారు నాచెంతఁ గూర్చుండి సగౌరవముగా నన్నుఁ గనిపెట్టి చూచుచున్నారు.

"సుమారు రెండు గంటలుగా మీా రీ యాత్మధ్యానమున నిమగ్నులై యున్నారు." అని యావృద్ధులు నాసంతోషమునుగూర్చి మోదింపుచుఁ జిఱునవ్వుతో ననిరి.

నేను ప్రత్యుత్తర మీాయఁ బూనఁగా నా కాశ్చర్యజనకముగా నా వాక్ఛక్తి శూన్యమయినట్లు గనుపడినది. ఆపయి పావుగంటసేపటికిఁగాని నాకు నోట మాట రాలేదు. అప్పు డావయోవృద్ధులు "ఇంత సేపును భగవానులవారు

మిమ్ముఁ గనిపెట్టియే యుండిరి. వారియొక్క సంకల్పము మీకు సాయపడినది.'' అనియును వచించిరి.

అప్పుడు శ్రీవారు కూటమున కేతెంచిరి. శిష్యులును భక్తులును గూడ నక్కడకు వచ్చిరి. శ్రీవారు సుఖాసీనులై నావంక దృష్టి నిగిడించిరి.

ఇంతలో నొక శిష్యుఁడు దీపములను దగ్గించును. అప్పుడు శ్రీవారియొక్క నయనములలోని ప్రశాంతతేజంబునం జేసి నేను మరియొక సారి చకితుఁడ నయితిని. అప్పుడు పూర్వభారతీయమహర్షుల ప్రకృతి వీరిలోఁ గాన నయినది. నిజముగా నరులే యయినను మహర్షులయిన వారి నయనంబుల యందుఁ బరమాత్మ తేజంబు తాండవించుచుండును.

అప్పు డూదువత్తులనుండి ససౌరభధూమ ముత్తుగాఁ జెలరేఁగినది. శ్రీవారి చూపు చలింపలేదు. ఆరీతిగా నలువది నిమిషములు గడచినను వారికిని నాకును మాట పలుకు జరగలేదు. మాటలు లేకయే మాకు భావములు తెల్లమగుచున్నప్పుడు మాటలతో నేమి పని? సంపూర్ణనైశ్శబ్ద్యము వల్లనే మామనంబులు సమావేశమై సంతసము నందుచున్న విప్పుడు. అనుక్తముగా వారినుండి నా కొక సందేశము తేటగా తెలియ నయినది. జీవితపరమావధినిగూర్చి శ్రీవారి దృక్కేదియో యిప్పుడు నా కవగత మయినది. నాహృదయము భగవానులవారి డెందముతో నేకీభావము నొందుటకుఁ బ్రారంభ మయినది.

ఇంతలో నాకు జ్వరము తలచూపినది. ఎట్లో దానిని సరిపెట్టుకొంటిని. ఆవయోవృద్ధులు నాకడకు వచ్చి సచింతగా "ప్రియసోదరా ! మీరు వెళ్లుదురా ? మరల వత్తురుగదా?" యనిరి.

"తప్పక వచ్చెదను" అని నేను సవిశ్వాసముగా నంటిని.

వారు వెళ్లుచుండఁగా నేను అక్కడి పవిత్రమయిన శ్రీమదరుణాచలమును గాంచితిని. అయ్యదియే నా కంద మయిన యాదరు వయినది. కూర్చుండునప్పుడును లేచునప్పుడును భుజించునప్పుడును పరుండునప్పుడును ధ్యానించునప్పుడును బరించునప్పుడును నాకు ఈపర్వతరాజంబు మదియందుఁ గానవచ్చెడిని. ఈస్థలమునందేదో యొకవిధమయిన యాకర్షణ శక్తి యున్నది. అంతకంటె ఈగిరీంద్రము నన్ను మిక్కిలిగా నాకర్షించినది. అట్లు గానిచో ఈయేకాంతాద్భుతమయిన శైలశిఖరము నన్ను వ్యాముగ్ధుం గావించివేసిన దేమో యని యు నాశ్చర్యపడుదును. ఆపర్వతము అంతర్భాగము డొల్లగా నున్నదనియును నం దెందఱో యాత్మజ్ఞాను లుందు రని వారు సామాన్యమానవుల కనుల కగుపడరనియును ఆప్రదేశము నందు నైతిహ్యము కలదు. కాని యది పిట్టకత యని నాకుఁ దోఁచినది. కాని, యింతకన్న నెత్తయినవియును నందమయిన వియు నయిన పర్వతముల నెన్నిటినో నేను జూచియుండినప్పటికిని ఈపర్వతరాజము నన్ను వశముగావించుకొన్నయది. అరుణారుణములును విషమవిషమములును నయిన యాసాను

భాగములచే నయ్యరుణాహ్వయరాజము మిక్కిలి గంభీరముగాను గౌరవజనకముగానుదనరారుచున్నది. మసకచీఁకటిసమయమున శ్రీభగవానులవారి కడఁ దక్క నెల్లరికడను సెలవు గైకొంటిని. నాయాత్మసంబంధమయిన వికార మడంగినది. కనుక నాకు సంతృప్తి యేర్పడినది. ఇయ్యది నే నెట్టి చర్చయును అకారణమగు విశ్వసింపును గావింప నవసరము లేకయే యేర్పడినది. ఇంతలో శ్రీవా రాయావరణములోనికి రాఁగానే నాలోని తృప్తి యనునది పరారి చిత్తగించినది. వారియొక్కయును నాయొక్కయును నంతరంగములకు దృఢమయిన బంధ మేర్పడినది. కాని వారు నాతో నట్లు దృఢానుబంధమును గల్గించుకొన్నది నన్ను విముక్తుని గావించుటకే గాని వ్యాబద్ధుం గావించుటకుఁ గాదు. ఆధ్యాత్మికప్రపంచపు దారిం దెన్నును గానట్టి యొకపాశ్చాత్యు న్ననుం బేర్మిమైఁ జేరం దీసి మహామునీంద్రుఁ డితఁ డెంతేఁ బేర్మితో నాత్మసాక్షాత్కారం బగునట్లు సల్పినాఁడు మహానుభావుఁడు. ప్రయాణపు సెల వడుగుటకు నోరు రాక నేను తట్టాడు చుంటిని. ఆకసంబునఁ జుక్కలు వెల్లఁదనంబు నొందఁ జంద్రోదయం బయినది. మిణుఁగురుపురుగుల సంచారంబును నారంభంబగుచున్నయది. అప్పుడు నేను ప్రయాణార్థము సెలవుగైకొనుచు భగవానుల వారికిఁ జేతులుజోడించి నమస్కారము గావించితిని. వారు చిఱునవ్వుతో నాపై నపాంగవీక్షణముం బరఁగించిరి కడపటి సారిగా శ్రీవారిశరీరయష్టిని దర్శించుకొని తేజోమయమయిన

యాచూపుల కానందించి వీడ్కొని వచ్చి యాశ్రమము వెల్పల నున్న యెద్దుబండి నెక్కి బయలుదేఱితిని.

[ఇయ్యది యాంగ్లేయభాషయందు పాల్ బ్రంటన్ గారిచే విరచితమయిన "Maharshee and his message" అను పొత్తమునకు శ్రీరమణమహర్షులవారి చరణపరిచరణపరమాణువులలో నొకఁడగు దోమా వేంకటస్వామిగుప్తచే నొనరింపఁబడిన "మహర్షియొుదత్సందేశము" అను నాంధ్రీకరణము.]

శ్రీరమణమహర్షిదివ్యపాదారవిందార్పితమస్తు.

---

# శ్రీమదరుణాచలాష్టకము

(సతాత్పర్యము.)

[శ్రీభగవాన్ రమణమహర్షులవారిచే నరవమునఁ గావింపఁబడినరచనమునకు శ్రీవారి యాశ్రిత పరమాణువయిన శ్రీకవిభూషణ,శతావధాని, విద్వాన్, దోమా వెంకటస్వామి గుప్త తెలిఁగించినది.

౧

మానవాలోచనాతీతమహిమఁదనరి
యల్లదే! కలదొకకొండ యవుర! దవుల,
దానిఘనత నారయ సాధ్య మేని కగును?
అల్లయరుణాచలము దేని నరయలేని
పిన్నపుడె నాదుడెందాన వెలుఁగుచుండె!!
అదెయగుఁ దిరువణ్ణామల యనిరి నాకు
నెవరొ? యట్లయ్యు దాని సమిద్ధత నిద
మిత్థమంచు నెఱుఁగ లేనయితిని నంత
దానిచేత నాకృష్టుఁడనై నొగిని ద
రికిని జని యచలమని యెఱింగినాఁడ!!

తాత్పర్యము:—అదుగో! ఒకకొండ దూరమునఁ గాన వచ్చుచున్నది. దానిగొప్పతనము తెలియ నసాధ్యము. అదే యరుణాచలము. నేనేమియు నెఱుంగని పిల్లవాఁడనుగా నుండినప్పుడే యది నాహృదయమున వెలుఁగుచుండినది. ఎవరో నాకది తిరువణ్ణామల యని తెల్పిరి. అయినను దానినిగూర్చి నాకు తేఁటగాఁ దెలియలేదు. అంత నేను దానిచే నాకర్షింపఁబడి సమీపించిచూడఁగా అది యొకకొండ యని తెలిసినది.

౨

అల్లయచలముం గాంచెడు నతఁ డెవఁ డని
మనమునం దెంచఁగను వాఁడు కనఁబడండు
కాని ఉండువాఁడె మదికిఁ గానవచ్చె
అటను 'గాంచితిన్ గాంచలే' దనఁగరాదు
తొలిని దక్షిణామూర్తివై తెలిపినట్లె
నీవు మౌనివై తెల్పుదు నిక్క మిపుడు
ఓయచలరాజ! మౌనసంయుతుఁడ! నీదు
తత్త్వ మీవె పల్కి తెలుపఁ దలఁపనియెడ
నింక నెవరు నీతేజు భాషింపఁగలరొ?
ఈ భవత్తత్త్వముం దెల్పనేకద యిట
నా స్వరుర్వీపరివ్యాప్తమయిన యచల
భావమూని వెలసినావు పరఁగ నీవు!

తా. ఆకొండను చూచువాఁ డెవఁడని లోన విచారించుకొనఁగా ఆకాంచెడువాఁడు కానరాఁడు. కాని యుండువాఁ డుండునట్లు మనస్సునఁ దోఁచినది. అప్పుడు చూచితి ననుటకు చూడలే దనుటకు వీలుగాదు. ఓయచలరాజమా! తొల్లి నీవు దక్షిణామూర్తి స్వరూపమునొంది మౌనముతో సత్యము న్మౌ దెల్పినట్లే యిప్పుడును తెల్పెదవు. ఓమౌనవంతుఁడా! నీస్వభావమును నీవే తెల్పనిచో నీతేజమునుగూర్చి యింక నెవరు తెల్పఁగలరు? ఈనీతత్త్వమును తెల్పుకొనుటకే కదా నీవిక్కడ ఈరీతి భూమ్యాకాశములకు అచలరూపముతో వ్యాపించి ప్రకాశించుచున్నావు?

3

నీవు రూపయుక్తుఁడ వంచు నేను నిన్నుఁ
జేరఁగోర నచలరీతి క్షితి నిలుతువు
నీదు రూపరహితభావ నీతి నెఱుఁగ
యత్నగించు టాకాశంబు నరయఁగోరి
యవనిచుట్టును దిరిగినయటులె యగును,
నీకు రూ పున్నదో లేదొ నెఱి నరయక
నిన్నుఁ గన నెంచు నాతండు నిక్కముగను
నొక్కచక్కెరబొమ్మ పయోధియంతు
నెఱుఁగ మున్నీటఁ బడి యందుఁ బొరిని దనదు
రూపు వీడి దానఁగలియు నేపుగాఁగ

నీదు తేజులో లీనతం జెందు నిజము.
'ఏను నే' ననుదానిని నెఱిఁగినంత
నీకు నాకును నాకును నీకు నేక
రణిని రూపభేదము దవ్వుఁ బొనరఁగలదు?
ఓయి! ప్రభు! యరుణాచలాత్యుత్తమాకృ
తిని దనరు నీవె సర్వవర్తివి నిజంబు.

తా ఓ ప్రభూ ! నీవు రూపముగలవాఁడ వనుభావముతో నేను నిన్నుఁ జేరఁగోరుచో ఈకొండరూపముతో నేలపయి నెలకొనియున్నావు. నీయొక్క రూపరహితరీతిని తెలిసికొనుటకుఁ బ్రయత్నించినయెడల ఆకసమునుగూర్చి తెలిసికోఁ దలంచినవాఁడు భూమిచుట్టును సంచరించినట్లే యగును. నీకు రూపు అనునది యున్నదా లేదా యని సరిగా విచారింపక నిన్ను తెలిసికొనఁ దలంచినవాఁడు ఒకచక్కెరబొమ్మ సముద్రముయొక్క యంతును తెలిసికొనఁగోరి యందుఁ బడి తనరూపము వదలి దానిలోఁ గలసిపోవునట్లు నిజముగా నీతేజములో కలసిపోవును. "నేను నేను" అనుదానిని తెలిసికొన్నప్పుడు నీకును నాకును రూపభేదముగాని దూరముగాని ఏరీతిగా నుండఁగలదు? అరుణాచలమను అత్యుత్తమమయిన రూపముతో నొప్పు నీవే యెల్లెడను నుండువాఁడవు.

౪

ఇటులఁ జెలంగి తేజున రహించు నిన్నుఁ విడనాడి, దేవుఁ డెచ్చుటఁ గలఁడంచుఁ గాంచుటన హస్తమునం దివియం ధరించి, చీఁ

కటికయి ప్రాఁకులాడినటు గాలదె? యిన్ని మతంబు లిన్ని వి
స్ఫుటమగురూపులఁ బొరిని బొల్చి వెలింగెడి నీ తెఱంగుఁ దె
ల్పుటకునె; యిట్టి నిన్నొగిని బోలనెఱుంగనివారు సూర్యుఁ జూ
చుటకున్నుగాని యంధులను జొప్పునఁ దప్పక పోలువార లు
త్కటవిమలారుణాచల! యగారముగాఁగ మదాశయంబు నం
తట నిబిడీకృతంబుగ ముదంబుగనుండు, మతుల్యరత్నమా!!

తా. ఈరీతిగాఁ బ్రకాశించు నిన్ను వదలివేసి దేవుఁ డెక్కడ నున్నాఁడని వెతకుట యెట్లుండుననఁగా చేతిలో దీపమునుధరించి చీఁకటికొఱకు వెతకిన ట్లుండునుగదా? ఇన్ని తేఁటయయిన రూపులతో నుండునట్టి నీయొక్కరీతిని తెల్పుటకే యిన్ని మతములు ప్రకాశించుచున్నవి. ఇట్టి నిన్నుఁగూర్చి ఆయామతస్థు లెఱుంగనియెడల నిజముగా వారు సూర్యుని జూడఁజాలని గ్రుడ్డివారివంటివారే యగుదురు. ఓయరుణాచలా! సాటిలేని మాణిక్యమా! సంతోషముతో నాహృదయ మంతటను బ్రకాశింపుము.

౫

రత్నహారమందు రత్నంబులందలి,దారమటుసకలమతముల జీవు
లందు నీవు వెల్గునట్టివాఁడ, వరుణశైలరూప! ధూత సకలపాప!!
పతనము సాననిడ్డటు కరంబు నఘాంచితమైన డెందమ
బ్బురమగు నిర్మలత్వమునఁబొల్చిన డెందముతోడనుం బొరిం
బొరిఁదన సర్వపాపములు పోయెడుదాఁకను ఘర్షణంబునుం

బొరసిన నందుఁగాంచనగుఁబో! భవదీయసు తేజ మప్పుడున్.
మఱి యపు డామనం బితరమైనది వస్తువుదేని దేని సం
కరతను జెంద, దెమ్మెయి నఖండరుచిం దగు రత్న మందునన్
మఱొకపదార్థపుంగుఱుతు మాటికొనం బొనరింపసాధ్యమే?
బొరి రవిపాదరంజనముఁబొందినదర్పణ మింక దేనిదై
న రుచిని జెందు నే? కనుఁగొనన్ సకలంబును నీవుగాక యిం
కొరుఁడెవఁడొప్పు? సంతతమహోజ్జ్వల! నిర్మలనిర్మలా! నిరం
తరమహనీయ సత్యకరుణాభరణా! యరుణాచలప్రభో! !

తా. ఓయరుణాచలస్వరూపా! సకలపాపదూరా! రత్న హారములోని రత్నములలోని దారమువలె నీవు సమస్తమతములయందలి సమస్తజీవులలోను ప్రకాశించుచున్నావు. రత్నమును సానఁబెట్టినట్లుగా పాపములతో మలినమయిన యొకానొక హృదయమును నిర్మలమయిన మఱియొక మనస్సుతో దానిపాపములు పోవువఱకు అనేకపర్యాయములు ఘర్షణనొందించినయెడల దానియందు నీయొక్క తేజస్సును గాంచనగును. ఇఁక నప్పు డామనస్సునకు ఏయితరవస్తువుతోడను సాంకర్యము గలుగదు. అఖండప్రకాశముతో వెలుఁగు రత్నముతో మఱేవస్తువునయినను జేర్ప సాధ్యమగునా? సూర్యకిరణకాంతి నొందిన యద్దమున కింక దేని తేజమయినను చేరునా ? విచారింపఁగా సమస్తమును నీవుగాక్క మఱియెవ్వరు? నిరంతరమహాప్రకాశా! నిర్మలులలో నిర్మలుఁడవు. అంతులేని గొప్ప నిక్కమయిన కరుణకు సముద్రమయినవాఁడవు. ఓయరుణాచలాధీశ్వరా?

౯౬

సకలాత్ముండవు నీవు; నీవలననే జ్ఞానంబుఁ దేజంబుఁ బు
ట్టుకనొందుర్ భిదగాక నీకడను నెప్డుంబోల్చు బల్వింత శ
క్తి కడుఱ్బ్రాక్కృతమన్న చుట్లనణుభాతిం బోల్చుచిత్రాఽఽళి
పొం, దికఁదేజోమతు లన్న ద్వారమున హృద్దీప్తిప్రథం బర్వనొ
ముకురంపుం దెరపైన నీడటు జగంపుంబొమ్మలం జూపు వా
రకవానిన్ బహిరంతరింద్రియములున్ రాణన్గనంజాలు దీ
నికినెల్లన్ బయినన్న నీపటిమయే నెక్కొర్ కతంబెంతయున్
రకమౌనట్టుల కాచదృ(Lens)గ్గతులఁజూడన్వచ్చునబొమ్మ ల
ట్లు కనన్వచ్చినఁ గాకయున్న, నవిచూడన్నీవె; భవ్యాచలా!!

తా. ఓపుణ్యపర్వతా! నీవు సమస్తాత్ముఁడవు. నీనుండియే జ్ఞానమును తేజమును నేర్పడుచున్నవి. నీదగ్గఱ నెప్పుడు నుండునట్టిదగు మిక్కిలి వింతయయిన యఖండమగుశక్తి పురాకృతమనుచుట్లయందు అణురూపమున నుండుచిత్రముల రీతిగా తేజోమతులద్వారమున హృత్కాంతియనుపేర నొప్పు సినిమామీఁద నీడవలెనే లోకచర్యాచిత్రములను జూపును. వానిని బయటి లోపలియింద్రియములు కాంచఁగలవు. ఇన్నిటికిని బయిఁదెల్పిన నీయొక్క శక్తియే కారణము. ఆప్రకారముగా 'భూతఅద్దము' ద్వారా బొమ్మలు కానఁబడినను కానఁబడకపోయినను ఉండువాఁడ వేమో నీవే.

౭

"నే"నను భావంబు మానినయెడల స
మస్తభావంబులు మాసివెడలు

వహింనంతదాకేవో భావముల్ పొడమిన
నవి యెరికొఅకని యరయు మెదను
"నాకొఅ"కను జవా బాకరణిని వచ్చు
నపు "డాయహంభావము పొడమె నెట?"
నని చర్చనూను-మీాయనువునలోతున
కరగినయెడ హృదయాంతరాన
నాసీనుఁబ్రభువును నందుదు-వక్కడ
ద్వంద్వంబు లెంతమాత్రము నెసఁగవు.
"నేనునీ"వను భిదధర్మ నిత్యధర్మములును
భవమృతుల్ సుఖదుఃఖములు వెలుంగుఁ
జీఁకటులు నివే కలలట్లుఁజెలఁగు ద్వంద్వ
ము, లివిపోయినవెన్కను బొనరునల్ల
చిత్తమనురంగమందున శ్రీకుఁడుఁ బర
మాత్మయగు నరుణాచలుం డాడుచుండు
అంతులేనిస్వయంజ్యోతి యమలసౌఖ్య
వార్ధియతఁడు మాంగళ్య ప్రభావమూర్తి.

తా. "నేను" అను భావము వదలినయెడల ఏభావమును ఉండదు. అంతవఱకు ఏవేవో భావములు కల్గినచో అవి యెవరికొఅకని మనస్సులో విచారింపుము. అప్పుడు "నాకొఅకు" అను ప్రత్యుత్తరమువచ్చును. ఆసమయమున "ఆయహంభావ మెక్కడిది?" అన్ని చర్చింపుము. ఈరీతిగా లోతునకు వెళ్లినచో హృదయాంతరమునందు నుండుపరమాత్ముని జెందఁగలవు. అక్కడ ద్వంద్వముల పొలఁకువ యుండదు. నేను నీవను భేదమును, ధర్మాధర్మములును,జననమరణములును,

సుఖదుఃఖములును, చీఁకటి వెలుతురులును ద్వంద్వములు. ఇవి స్వప్నప్రాయములు. ఇవి పోయినపిమ్మట ఆచిత్తమనురంగమునందు శ్రీపరమాత్ముఁడగు అరుణాచలుండు నాట్యము గావించుచుండును. అతఁ డంతులేని స్వయంజ్యోతియును, నిర్మలసౌఖ్యవారాశియును, మాంగళ్యమహత్త్వస్వరూపుఁడును అగును.

౮

సాగరనీర మంబుదపుఁజాడ్పున వానను గొల్వ నల్లనీ
రేగతులన్ భువిన్ గదలి యెన్నిటినడ్డులనేని దాఁటి యెం
తేఁగడకున్ సముద్రమున నేకతఁజెంది ప్రశాంతిగన్న య
ట్లోగురుశాంతివార్ధి! యరుణోర్వీధరా! తనువొప్పుజీవి య
ట్లే గరిమన్ నినుంగదలి-యేగతులోచని-యెందుసొంపుగా
కోఁగను లేక-నీదుకడకున్ జనఁగా మునువచ్చినట్టి త్రో
వేఁగఁగ బూని-కట్టకడ కింపుగఁగోర్కి ఫలించి తావకై
క్యాగమలబ్ధియాదనుక నందఁడుశాంతిని నెందునేని యుం-
బాగున నేలగూటివిడి పక్కియొకండు నభంబునందు బల్
వేగముగాదవుల్ దిరిగి వే మరలం దనగూటిచోటికై
తాగతిఁజూచివచ్చి యటఁదద్దయు శాంతిని జెందునట్లు సు
శ్రీగరిమాభిరామ! యహరీశచమూసమధామ! శంకరా!!

శ్రీరమణమహర్షికృతము శ్రీకర మరు
ణాచలాష్టక మిష్టదం బలమహర్షి
సత్తమునియిచ్ఛమైఁ దెల్గుసల్పె ద్రవిడ
వాణికిని దోమ. వేంకటస్వామిగుప్త.

తా. శ్రీమహత్త్వనిధానా! సూర్యసమానతేజా! శంకరా! సముద్రములోనినీరు మేఘములరూపున వర్షమును గల్గింపఁగా, అట్లుపడిన నీరు ఏరీతిగాను నేలపయిఁ బ్రవహించి యెన్నియడ్డములనయినను దాఁటి కడపట సముద్రమును జెంది ప్రశాంతినొందును. ఓపరమశాంతిసముద్రమా! అరుణాచలా! ఆరీతిగానే శరీరధారియగు జీవి నీనుండి కదలి యేయేమార్గములలోనో వెళ్లి యందు సౌఖ్యమును జెందలేక నీదగ్గఱకు వచ్చుటకై ముందు తానువచ్చినత్రోవనే వెళ్లుటకుఁ బ్రయత్నించి కడపట నిష్టసిద్ధినొంది నీతోఁ జేరుకొనువఱకు శాంతి నొందఁడు. నేలపయినఁ గలగూటిని విడిచి యొకపక్షి ఆకాశమునందు వేగముగా మిక్కిలి దూరము సంచరించి మరల తన గూటికిఁ జేరురీతి పయిని శరీరధారి జీవుని చర్యకును సమానము.

ఇయ్యది శ్రీరమణమహర్షులవారు అరవమున రచియించిన శ్రీమదరుణాచలాష్టకమునకుఁ దెలుఁగుపద్యములు రచియించిన తచ్ఛిష్యపరమాణువు దోమా వేంకటస్వామిగుప్తచే వ్రాయఁబడిన లఘువివరణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సునముద్రితము.—1936.